

శ్రీ సత్యసాయిబాబా పాదపద్మములకు వి వి యస్ రామశర్మ
నమస్సుమాంజలి

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

మే 1993

సంపుటి : 8

సంచిక : 5



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818



| | |
|---|---|
| విడి ప్రతి | . రు. 4-00 |
| సంవత్సర చందా | . రు. 48-00 |
| 4 సం॥ల చందా | . రు. 175-00 |
| జీవిత సభ్యత్వం | . రు. 600-00 |
| పోషకులు | : రు. 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM


## విషయ సూచిక



చందాలను సకాలంలో రెన్యూవల్ చేయండి! క్రొత్త చందాలను చేర్పించి, పంపి శ్రీవాణిని ప్రోత్సహించండి! ఉత్తమ సాహిత్యాన్ని పోషించండి! పదిమందికి పంచండి!

- సం.

ముఖ చిత్రం: విశ్వజనని ఈశ్వరమ్మ

# శ్రీవాణి శతసంచికోత్సవ సంరంభం

బందరు సాహితీ వైభవ ప్రతీక శ్రీవాణి శతసంచికోత్సవ సభావేదిక ది 11-4-93 ఆదివారం సాయంత్రం గం 8-12 ని॥లకు ఆదర్శ విద్యానిలయ ప్రాంగణములో ఆదర్శ కళావేదికపై రంగరంగ వైభవంగా నెఱపబడ్డ మహోత్సవ సంక్షిప్త అక్షర చిత్రణ

బందరుపట్టణం సంగీత, సాహిత్య, నాటక కళా రంగాలలో ఒక విశిష్ట స్థానం ఆర్జించుకున్నది అట్టి వాటిలో సాహిత్యపరంగా అవధానాలకు ఆటపట్టై, చెళ్ళపిళ్ళ, కాశీకృష్ణులు, నాదెళ్ళ, పింగళి, కాటూరి, పువ్వాడ, అద్దేపల్లి వంటి కవివరేణ్యులకు, రావూరి, మునిమాణిక్యం జరుక్‌శాస్త్రి వంటి సాహితీపరుల కలాలు కదిలిన నేల పత్రికాప్రచారణలో కూడా అందెవేసింది అందుకు ఆద్యులు స్వర్గీయ కొండా వెంకటప్పయ్య పంతులుగారు, ముట్నూరి కృష్ణారావు గారి వంటి మహామహుల మేధస్సునుండి ఆవిర్భవించిన 'కృష్ణాపత్రిక' ఒకప్పుడు ఉజ్వలంగా ప్రకాశించి, ఇప్పటికి నామమాత్రంగా నడపబడుతున్న ఆ వార పత్రిక పత్రికారంగంలో బందరు పట్టణ పేరు మ్రోగించింది

ఒక పత్రిక నిర్వహించడం అశిథారావ్రతం కంటే శ్రమతో కూడింది ఈ ఉత్సవ కారణమైన 'శ్రీవాణి' శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావుగారి సంకల్పబలంగా ఆవిర్భవించి కొంతకాలం బాగానే నడచి వెనకడుగు వెయ్యాల్సిన పరిస్థితుల్లో భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి కరుణా కటాక్ష వీక్షణంగా పత్రికా గమనానికి స్ఫూర్తినిచ్చింది.

ఆదినుండి నేటిదనుక నూరుమాసాలు నిండి శత సంచికోత్సవం నెఱపుకొన్న 'శ్రీవాణి' వైభవం స్వయంగా దర్శించని వారికి ఈ అక్షరరూప చిత్రణ సందర్శకం కాగలదని భావనచేస్తూ వివరిస్తాను.

బందరు నడిబొడ్డున ఆదర్శవిద్యాలయం సువిశాల ప్రాంగణంలో, నిర్మితమైన ఆదర్శ కళావేదిక అదే "శ్రీవాణి" సభాస్థలి వేదిక వెనుకభాగాన ముదురు నీలం తెరపై విచిత్ర వైఖరిలో పలురంగుల కలబోసి కూర్చిన, పలురంగుల కాగితాల పసందు, వేదిక శీర్ష భాగాన, ఏర్చిపేర్చిన కృత్రిమ సుమలతా వితాన పూజాలు, కురులు కురులుగా జార్చితీర్చిన చమ్కీసరాల తళతళలు, కళకళలాడే ఆ శోభకు కళాత్మకంగా తీర్చిన మల్లెమాలల గుభాళింపు, కనువిందు కొలిపే సభాస్థలి మధ్యస్తంగా అలంకార శోభితంగా సమకూర్చిన వేదిక, ఆ వేదిక వెనుక ముఖ్య అతిథుల ఆగమనానికి ఎదురు చూస్తున్నట్లు మౌనముద్ర వహించిన సుఖాసనలు, సభావేది దక్షిణభాగమున ముందుగా స్వాలంకృతంగా ప్రసంగవేది ఆ వేదిక ముందు పీఠంపై శ్రీ వాణి విగ్రహం సుమహార శోభితంగా సభాసదులకు ప్రత్యక్షమై ప్రసన్నవదనంగా దర్శనమిస్తున్నది వేదికకు మరో ప్రక్క వామభాగంలో శత సంచికావిష్కరణకు సిద్ధమైన ప్రత్యేక ఉన్నతపీఠం, ఆ పీఠం ముందుభాగాన, మందస్మితానందకతో అభయహస్తం చూపుతున్న భగవాన్ సత్యసాయిబాబావారి చిత్రపటం, దానిముందు ప్రజ్వలింపచేయడానికి అమరించిన జ్యోతి, చూపరులకు దేవేంద్ర వైభవం భ్రమింపచేస్తున్న వేదిక, ఇది "నాదెళ్ళ" వారి అపురూపసృష్టి శిల్పచాతుర్యప్రతీకగా కమనీయంగా రమణీయంగా, సదస్సులను ఆకట్టుకొనే రీతిగా రూపులు దిద్దుకున్న కళావేది ఆ వేదిక ముందు భాగాన ఇరుప్రక్కలా శ్రీవాణి శత సంచికల ముఖ చిత్రాల ప్రదర్శనను తిలకిస్తూ ఆహూతులైన సదస్సు

లకు వీనులవిందుగా వినిపిస్తున్న వేదం సన్నాయినాదం, అరుణాయలు ప్రాంగణంలో సాయంసంధ్యా సమయ మారుతం ఆహ్లాదం కలిగిస్తున్న సుముహూర్త సమయం సరిగ్గా ఆరుగంటల పన్నెండు నిమిషాలు ప్రసంగవేది ముందు అమలేశ్వరీ విద్యాలయ అధినేత శత సంచికోత్సవ ఆహ్వాన సహకార్యదర్శి శ్రీ బి హనుమంతరావు గారి గళం రవళించింది. సభ సద్దుమణిగింది. మంద గమనంలో మంగళవాద్యాల నేపథ్యంలో వినిపిస్తుండగా, పరిచయ వాక్యాలతో ముఖ్య అతిథులను ఒక్కొక్కరినే వేదికకు స్వాగతం పలికేరు. ముందుగా విజయవాడ శ్రీవాణీ నికేతన్ వ్యవస్థాపకులు శ్రీ కోనేరు రామచంద్రరావుగారిని సభాధ్యక్షులుగాను, అనంతరం ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకులు శ్రీ వాకాటి పాండురంగారావు గారిని ముఖ్యఅతిథిగా, ఆహ్వాన సంఘాధ్యక్షులు బందరు హిందూకళాశాల అనుబంధ సంస్థల కార్యదర్శి శ్రీ దైతా మధుసూధనశాస్త్రి గారిని జ్యోతిని ప్రజ్వలింప చేయడానికి, సంచికావిష్కర్తగా "సుప్రభాతం" వారపత్రిక సంపాదకులు శ్రీ లంక రత్తయ్యగారిని, అనంతరం ప్రధాన వక్తలుగా గుంటూరు హైందవ కళాశాల అధినేత ఆంధ్రాధ్యాపకాచార్యులు, కవి పండిత శ్రీ పరిసాదరాయ కులపతిగారిని, ఆకాశవాణి విఖ్యాత కళాకారులు శ్రీ ప్రయాగ రామకృష్ణగారిని ఆహ్వానించి, శ్రీవాణికి శ్రీకారం చుట్టి శత సంచికోత్సవ సభకు ఆద్యులు శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావుగారిని శ్రీవాణి సేవానుభవాల నివేదనకు, సభానిర్వహణలో తనకు తానే సాటిగా ఖ్యాతి గడించిన, "నవ్యకవి" నాదెళ్ళ పురుషోత్తమశాస్త్రిగారిని సభాప్రయోక్తగా వేదికకు ఆహ్వానించారు. వినూత్న విధంగా వేదికకు ఆగమించిన ప్రతి ఒక్కరిని ఎప్పటికప్పుడు ఆహ్వాన సంఘ సభ్యులు ఒకరు పూలహారం సమర్పించగా మరొకరు జ్ఞాపికను బహూకరిస్తుండగా కొమరగిరివారు దుశ్శాలువా కప్పి సత్కరించారు. వేదికపై ఆసీనులు కావలసినవారి ఆహ్వానం ముగించిన హనుమంతరావు గారు అనంతర సభాకార్యక్రమ నిర్వహణ బాధ్యతి సభాప్రయోక్త నాదెళ్ళ వారికి దత్తంచేసి శెలవు తీసుకున్నారు. ప్రయోక్త నాదెళ్ళవారు తనదైన శైలిలో ముందుగా మున్నుడి పలుకుతూ ఒకనాడు బందరు



కిరీటికందమైన "కృష్ణా పత్రిక" ప్రభావాన్ని వివరిస్తూ, బందరు కీర్తిని ఇనుమడింప చేయడానికి ఆవిర్భవించిన "శ్రీవాణి" స్థాపన, అనంతర పరిణామాలు, భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ఆశీఃప్రభావంగా ఒడుదుడుకులు సమసి సాహిత్య, సాంస్కృతిక, విద్యా, విజ్ఞాన ఆధ్యాత్మిక వేదాంత స్ఫోరక రచనా సముదాయంతో రాగరంజిత మంజీర రవళీ నిస్వనాల సుస్వనాలతో సాహితీ మహారాజ్యంలో మహారాణిలా విహరిస్తున్న శ్రీవాణి దేశదేశాంతర వ్యాపితంగా మాసంమాసం సాహితీ ప్రియంభావుకుల హృదయస్పందనా సురంజికంగా సాహితీ సుమాలు విరియిస్తూ శత మాసం పూర్తి చేసుకున్న సుసమయం ఈ సమయం.

వాగ్దేవీ కృపావీక్షణకు, శ్రీ సత్యసాయి కరుణ కటాక్షం తోడై పత్రికాలోకంలో కీర్తికిరీటం ధరించి రమణీయ సౌందర్యరాసిగా వాసికెక్కి కమనీయసాహితీ ఖండికలతో నిండుతనం సంతరించుకొని, గమనం సాగిస్తూ అందరి ఆదరాభిమానాలు చూరగొన

సర్వాంతరాణి మావాణి మీవాణీ, శ్రీవాణి సభా కార్యక్రమానికి శ్రీకారంగా ఆదిమ్మరాజీ జయవాణి అనుగ్రహాన్ని అర్థిస్తూ, సభావిజయాన్ని ఆకాంక్షిస్తూ, శ్రీమతి రాజేశ్వరీ అశ్వనీకుమార్‌గారు ప్రార్థనాగీతాన్ని ఆలపిస్తారని ప్రయోక్త ప్రకటించగా సుమధుర గాయని, నాదెళ్ళవారి కలం నుండి వెలువడ్డ గీతి :-

జయ జయ జననీ జయవాణీ

జయమనుమమ్మా శుభవేణీ

అంటూ మనోరంజకంగా, కరుణామతల్లి కరుణాకటాక్ష లబ్ధంగా, ఆర్ద్ర హృదయంతో చేసిన వినయ గానానికి ఆ చదువులతల్లి వేదికనలంకరించిన సాహితీ రసరాట్టులను ఆవహించి వారి వాణినుండి స్రవంతిలా వాగ్వాణి



మనందరికి సాక్షాత్కరిస్తున్నదంటూ భావన చేస్తూ, సభాప్రయోక్త సభాసూచకంగా జ్యోతిప్రజ్వలనానికి అర్థించగా, శ్రీ ద్వైతా మధుసూదనశాస్త్రిగారి కరకమలాలతో వెలుగొందిన జ్యోతి ప్రకాశంలో సదస్సుల కరతాళధ్వనులు మిన్నుముట్టగా బాబాగారు వదనం వికసిస్తూ అభయహస్తదర్శనమైంది కాంతి ప్రజ్వలన కారులు బాబాగారికి వినమ్రులై పూలహారమిడి, అగర ధూపం ప్రజ్వలింపచేసి కేలుమోడ్చారు.

"శ్రీవాణి" తప్పటడుగులు వేస్తున్న తరుణంలో ఏ మహనీయుని అనుగ్రహంగా సమస్యలు సమసి సుగమనం సాగిస్తున్నదో ఆ భగవానుడు సత్యసాయిని స్తుతిస్తూ కొమరగిరివారు రచించిన "శ్రీ సాయి గీతి" కృష్ణమోహనరావుగారి సతీమణి శ్రీమతి జయప్రదగారు, వారి తనయిని కుమారి విజయగౌరి సదస్సుల హృదయ స్పందనానురంజకంగా యుగళగానం చేయగా, ఆ గాన మాధుర్యం, పుట్టపర్తిలో ఆ మూల సౌధంలో ధ్యాన నిమగ్నులై వున్న శ్రీ సత్యసాయి వారిని కదిలించి ఈ సభా విజయానికి ఆశీస్సులు లభించినాయనడానికి మీ ఎదుట ప్రత్యక్షమైన బాబాగారి ప్రతిరూపంలో వారి మందస్మిత వదనమే సంకేతంగా ప్రయోక్త వ్యాఖ్యానించారు

అనంతరం జ్యోతి ప్రజ్వలనకారులు, ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ ద్వైతావారు ముఖ్య అతిథులకు, ఆహూతులైన సదస్సులకు స్వాగతాంజలి ఘటించడంతో సభారంభమైంది

అప్పుడు సభా ధ్యక్షులు శ్రీ కోనేరు రామచంద్రరావుగారు శ్రీవాణిని అభినందించుతూ దీనేత కొమరగిరి వారిని ప్రస్తుతించుతూ భవిష్యగమనానికి శుభాకాంక్షలు తెలియ చేశారు

ఉత్సవకీలకమైన అంశం "శ్రీవాణి శతసంచిక" ఆవిష్కరణ అందుకు ప్రయోక్త అభ్యర్థన మేరకు ఆవిష్కర్త శ్రీ ఎల్ రత్తయ్యగారు నిర్దిష్ఠ ఆవిష్కరణ పీఠం సమీపించగా నేపథ్యంలో మంగళతూర్య నాదాలు, వేద ప్రవచనం ఉచ్ఛస్వరంలో వినిపిస్తూండగా

వివాహ సమయంలో కళ్యాణవేదికపై ఆశీనురాలై ముసి ముసి నవ్వులు ముగ్ధగా సాలంకృతయై మేలిముసుగులో ఒదిగి తెరసెల్లా తొలిగింపుకు ఆతురం చెందుతున్న వధువులా ఆశీనురాలైన "శ్రీవాణి" ముఖారవింద సౌందర్యాన్ని ఆవిష్కరించి అందరికి ప్రదర్శింపజేశారు

ఈ సమయంలో నాదెళ్ళవారి కృతమైన ఉత్సవగీతం శ్రీమతి రాజేశ్వరి అశ్వనీకుమార్, శ్రీమతి హరిగాయత్రి గారు సరళంగా యుగళంగా ఆలపించి సభను రంజింపజేసి ప్రశంసలందుకున్నారు

ఇప్పుడు పత్రికా సంపాదకులు శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావుగారు, వారి 'శ్రీవాణి' సేవానుభవాలను సభకు నివేదించారు

శతసంచికావిష్కరణ శ్రీ షబ్ రత్తయ్యగారి సందేశంలో శ్రీవాణి పురోభివృద్ధికి తన వంతు సహకారమును అందిస్తామని వాగ్దానంచేశారు తదుపరి ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ వాకాటి పాండురంగారావుగారు ఉపన్యాసం సదస్యులను ఆనందోల్లాసములలో ముంచివేసింది ఈ మహోత్సవ ఆహ్వానాలు అంది ఎందరో మహనీయుల నుండి ఆశీస్సులు, అభినందనలు లభించగా అందులో కొందరివి శ్రీవాణి అభిమాని శ్రీ కె కె విశ్వనాధ్‌శాస్త్రిగారు సుమధురంగా వినిపించారు.

ప్రధాన వక్తగా ఆశుకవితా విశారదులు అవధాన శేఖరులు శ్రీ ప్రసాదరాయకులపతిగారు సంగీతరవళి ధ్వనించే గళంతో తేనెలొలికే తెలుగు భాషకు వన్నెకూర్చే విధంగా "శ్రీవాణి" కి నీరాజనం ఘటిస్తూ ఆశువు చెప్పారు

తదుపరి ఆలిండియా రేడియో శ్రీ ఎర్రియాగ రామకృష్ణగారు తనదైన బాణిలో హాస్యరసోక్తులతో సభ్యులను అలరిస్తూ, సాహితీ కాలుష్యాన్ని నివారించడానికి "శ్రీవాణి" వంటి ఉన్నతస్థాయి పత్రికలు ఎంతైనా అవసరమని అంటూ శ్రీవాణి సహస్రసంచికోత్సవం నెరవుకోవాలని ఆకాంక్షించారు.

అనంతరం, 'శ్రీవాణి' శతసంచికాగమనంలో పాలుపంచుకుంటూ పత్రికకు ఎన్నో తెచ్చిన వారిలో ఎంచుకున్న ముప్పురు, శ్రీ కంచి వాసుదేవరావుగారు, శ్రీ సోమంచి రామంగారు, శ్రీ పాతూరి ప్రసన్నంగార్లకు శ్రీ కొమరగిరివారు సన్మానించి దుశ్శాలువలు, జ్ఞాపికలు



సమర్పించారు ఈ సందర్భంగా తాజ్‌మహల్ నిర్మాణంలో రాళ్ళెత్తిన కూలీలను విస్మరించినట్లు కాకుండా శ్రీవాణి సంచికా విభవానికి అహర్నిశలు శ్రమిస్తూ సహకారాన్ని అందిస్తున్న కార్మికులకు సభాముఖంగా జ్ఞాపికా బహూకరణ చేసి సత్కరించటం విశేషం

ముగింపులో శ్రీ పాతూరి ప్రసన్నంగారి "సంధ్యావందనం" గ్రంథాన్ని ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ దైతా మధుసూదనశాస్త్రిగారు ఆవిష్కరించగా, ఆహ్వాన సంఘ కార్యదర్శి శ్రీ గుడివాడ రామచంద్రరావుగారు వందన సమర్పణతో సభ సమాప్తమైంది

దూరదర్శన్ ప్రభావం మిక్కుటంగా వుండి, సాంస్కృతిక కార్యక్రమాల పట్ల ప్రజలకు అనాసక్తత ముసురుకుంటున్న ఈ రోజుల్లో మూడుగంటలపాటు జరిగిన "శ్రీవాణి" శతసంచికోత్సవ సభ ఆద్యంతాలు విందుగా దండిగా ఉండటం, బాబాగారి ఆశీః ప్రభావమో, సాహిత్యాభిమానమో అవగతం కాకున్నా, శ్రీవాణి సహస్రసంచికోత్సవానికి గమనం సాగించడానికి సంపూర్తిగా స్ఫూర్తినిచ్చిందనడం అతిశయోక్తి కాదు

అప్పటికీ ఇప్పటికీ బందరు పట్టణంలో సాహిత్యాభిమానులకు కొదవలేదని ఈ ఉత్సవం నిరూపించింది ●

# గంజాయి వనంలో తులసిమొక్క "శ్రీవాణి"

వాకాటి పాండురంగారావు

" పలికించెడివాడు రామభద్రుండట " అన్నాడు పోతన ఇక్కడ " పలికించెడివాడు సాయిభద్రుడు, లికేవాడు కృష్ణమోహనరావు. " ఈ యుగళగీతం మధ్య మనందర్ని శ్రోతలుగా పిలిచారు వాళ్ళిద్దరే మాట్లాడు కుంటుంటే మనమందరం అసూయపడుతామని మధ్య మనల్ని వుండమన్నారు గనుక మనకుకూడా కాసేపు వుండటానికి హక్కు వున్నది

ఇప్పుడు మనం ఉన్నది తల్లక్రిందుల యుగం గ్రామసింహాలు (శునకాలు) సింహాలుగా, అక్షరాస్యత విజ్ఞానంగా, కొవ్వొత్తి సూర్యుడిగా, గంజాయి మొక్క తులసిదళంగా చలామణి అవుతున్న ఈ తరుణంలో అశ్లీల సాహిత్యం యువతను పెడదారిన పట్టిస్తున్న ఈ తరుణంలో ఈ గంజాయివనంలో తులసిమొక్కలాగా శ్రీవాణి అధ్యాత్మిక చింతనను ప్రభోధిస్తూ సాంస్కృతిక విలువలను పెంపొందిస్తున్నందులకు అభినందిస్తున్నాను సాహిత్యం అనేది ఒక శక్తివంతమైన సాధనం దానితో జంతువులనుకూడా మనుష్యులుగా చేయవచ్చును కాని తద్విరుద్ధంగా నేడు పత్రికలు మనుష్యులను జంతువులుగా చేసే ప్రయత్నంలో ఒక దానితో ఒకటి పోటీపడుతున్నాయి. ఏ సాహిత్యమైన, జ్ఞానంతో వుండిన ఏ వ్యాపారమైన మెడ పైభాగంతో సంబంధము ఉన్నది కళ్ళతో చూస్తాం, చెవితో మంచి మాట వింటాం, నోటితో మంచి మాట చెబుతాం తరువాత మెదడుతో ఆలోచిస్తాం. కాని ప్రస్తుతం పత్రికలన్నీ కూడా మొలదిగువ భాగానికి మాత్రమే పరిమితమై పనిచేస్తున్నాయి అంటే Below the Belt సాహిత్యకారులు మనకు పరమ ఆదర్శప్రాయులుగా చలామణి అవుతున్నారు. ఇటువంటి వైరుధ్యంలో "శ్రీవాణి" వంటి పత్రిక బ్రతకటమే అసలు చాలా విచిత్రమైనటువంటిది అంటే ఒక ఎడారిలో పెనుతుఫాను గాలి మధ్య చిన్న ప్రమిద వెలుగుతుందా ? అంటే... వెలుగుతుందనే పరమ సత్యానికి అది ఒక ఋజువుగా తీసుకోవచ్చును మనం అంటే మనిషియొక్క ఆత్మ విశ్వాసంకూడా అహంకారమవుతుంది పరమాత్మమీద మనకున్న విశ్వాసం మనలో కొద్దిగా ప్రతిఫలించి "ఒక్క సూర్యుడు సమస్త జీవులకు తానొక్కక్కడై చందాన " ఎక్కడో పుట్టపర్తిలో కూర్చున్న ఒక కరుణామూర్తి, ఈ మూల బందరులో వెలిగించిన దీపం కనుక, అది పెనుతుఫానులకు తట్టుకొని నిలబడుతున్నది కృష్ణమోహనరావుగారు నిమిత్తమాత్రులు. కాని ఆయన అనుకున్నటువంటి మహాచైతన్యం ఏదైతే ఉన్నదో, అది ఈ దేశాన్ని 8 వేల సంవత్సరాలనుంచి జాగ్రత్తగా కాపాడుకుంటూవస్తున్నది. ఒక దేశం యొక్క సంస్కృతి అనేది ఒక రోజులో, రెండు రోజులలో వచ్చేదికాదు. అనేక తరాలమీద, అనేక అనుభవాలమీద, అనేకమంది మహనీయుల తపఃఫలంవలన సంకల్పితమైన జ్ఞానాన్ని మనం ఎప్పుడైతే అందుకోగలుగుతామో, అప్పుడే ఒక జాతికిగాని, సంస్కృతికిగాని భవిష్యత్తు ఉంటుంది ప్రస్తుత పరిస్థితినిచూస్తే ఈ దేశం ఎక్కువ కాలం మనగలగదేమోననే సందేహం వేస్తుంది ఇటువంటి భయాలు ఏమీ అక్కరలేదు ఎందువలనంటే యీ దేశంలో అడుగడుగునా, ప్రతి శతాబ్దంలో మహానుభావులు ఉదయిస్తూనేఉన్నారు ఆదిలో మన మహర్షులు తమ దివ్య పథంద్వారా కనుగొనిన పరమ సత్యాలను, నేటికి, ఏనాటికి, ఆనాటికి కావలసినవిధంలో అన్వయించి చెబుతూ ఆచరణలో చూపిస్తూ మన మధ్య వుంటూ,

మనలో ఒకరుగా తిరుగుతూ వున్నారు  వారు మనలో ఒకరుగా తిరుగుతున్నారు గనుక మనం వారిని నమ్మం. వారుచేసే మంచిని మనం చూడం  సాయిబాబాగారు హాస్పిటల్ కట్టించుతే మనం చూడము  సాయిబాబాగారు 746 మందికి ఉచితంగా గుండె ఆపరేషన్లు చేయించుతే నమ్మము  వారు విద్యాసంస్థలు పెడితే మేము చూడము కాని అక్కడికివెళ్ళకుండా, వారిని గురించి చదవకుండా, సాయిబాబావారిని నమ్ముకున్న వారితో ప్రమేయం పెట్టుకోకుండా, సాయిబాబా దొంగ! మోసకారి! అనటానికి ఏమాత్రం వెనుకాడని దౌర్భాగ్యపు హేతు



వాదులు ఎందుకున్నారో నాకు అర్థం కావటంలేదు వారందరికీ నా మనవి ఒక్కటే  నమ్మటం నమ్మక పోవటం వారిష్టం  కాని ఒకసారి అక్కడికివెళ్ళి ఒక రోజు ఉండండి. లేదా ప్రపంచంలో ఎంతోమంది మహానుభావులు వారిని గురించి వ్రాసిన పుస్తకాలను ఓపికగా చదవండి. ఇంకా తెల్సుకోవాలంటే సాయి బాబాతో ఒక ఇంటర్‌వ్యూ సంపాదించుకోండి. అటు వంటి ప్రయత్నం ఏమీ చేయకుండా విమర్శించడం శాస్త్ర సమ్మతమా ?

నేను సాయి భక్తుడను గాను, నేను సాయిబాబాను ప్రేమిస్తున్నాను  ఎందువలన ? ఒకానొక క్లిష్ట సమయంలో, ఆయన అపార కరుణామూర్తి కనుక ఒక గొప్ప సహాయం ఆయననుంచి నాకు వచ్చింది  ఆయన నుంచే ఎలా వచ్చిందంటే, మనసుకు తెలుస్తుంది అప్పుడు కృతజ్ఞతా పూర్వకంగా అక్కడికి వెళ్ళి కాంపౌండు బైట నుండే ఆయనను చూచి దండం పెట్టుకొని వచ్చాను  ఆ తరువాత ఆయన బహుశా నన్ను వదలదలచలేదు.  ఒక పర్యాయం నా దగ్గరకు సాయి బంధువులు వచ్చి ఒక పెద్ద హాస్పిటల్ పుట్టపర్తిలో ఆరునెలలోనే కట్టారు  దానిని గురించి వ్రాస్తే బాగుంటుందని నన్ను కోరారు  అంత పెద్ద హాస్పిటల్ అయితే నేను వెళ్ళి చూచి వ్రాస్తానన్నాను నేను వెళ్ళి చూచాను  అది మహత్తరమైన కట్టడం ఆ కనస్ట్రక్షన్ ఛీఫ్ ఇంజనీరును కలిశాను, వివరాలు కనుక్కుంటే మూడులక్షల చదరపు అడుగుల కార్పెట్ ఏరియాను 180 రోజులలో కట్టామని చెప్పారు.  ఒక వెయ్యి చ అ ఏరియా ఇల్లును మనం ఆరునెలలో

కట్టలేము ఇల్లు కట్టే వారందరికీ ఈ విషయం తెలుసు 3 లక్షల చ అ. ఏరియాను, బకింగ్‌హోం రాజప్రసాదం లాంటి అందంగా నిర్మించి, అన్ని వైద్య సౌకర్యాలను ఏర్పాటు చేయటం బహు కష్టసాధ్యం అంతా పూర్తి అయిన తరువాత మరల ఒకసారి వెళ్ళాను ఎవరైనా యాక్సిడెంట్ అయి అక్కడికి వస్తేఎన్నో అంతస్తులో నున్న ఆపరేషన్ థియేటర్ లోనికి అతనిని తీసుకొని వెళ్ళటానికి కేవలం రెండు నిముషాలు మాత్రమే పడుతుందని చెబుతూ, ఆ ఏర్పాటును చూపించారు అంటే అక్కడి ప్లానింగ్ ఎంత అధునాతనంగా వున్నదో ఇది ఒక చిన్న ఉదాహరణ మాత్రమే దీనిని చూచి ఉన్నదన్నారు అందువలన మేము ఈ పని చేయ గలిగినామని చెప్పారు ఆయన

ఆ రాత్రి ఇప్పుడు హాస్పిటల్ సూపరిండెంటుగా వున్న సఫాయిగారిని కలిశాను ఆయన అప్పుడు ఢిల్లీలో ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సుకు సూపరింటెండెంట్‌గా వున్నారు ఆయనతో పదినిమిషాలు మాట్లాడాను నేను ఇంకా ఢిల్లీలో రిలీవ్ కాలేదు, త్వరలో యిక్కడకి వస్తున్నానన్నారు ఆయనను, గోపీనాథ్‌ను ఢిల్లీలో వుండగానే నేను ఎరుగుదును ఆయనను ఒక విషయం అడిగాను ఢిల్లీలాంటి మహా నగరంలో ఒక జీవితపు శైలికి మీరు అలవడతారు ఎంత హాస్పిటల్‌లో పని చేసినా, సాయంత్రానికి

## మన్నించండి ! క్షమించండి !

శ్రీవాణి శతసంచిక సర్వాంగసుందరంగా అత్యంత ఆకర్షణీయంగా, సందేశాత్మకంగా, ప్రబోధాత్మకంగా ఉన్నదని చాలామంది పెద్దలు ప్రశంసిస్తూ లేఖలు వ్రాస్తున్నారు అందరికి నా కృతజ్ఞతలు అయితే భగవాన్ బాబా వారి ఫోటో ఒకటికూడ శతసంచికలో లేకపోవడం శోచనీయమని కొందరు భక్తులు బాధపడుతూ వ్రాసినారు. ఆ బాధలో నేనూ పాలుపంచుకుంటున్నాను శతసంచికలో బాబావారి ఫోటో పెడుతున్నామని "కృతజ్ఞతలు" (ఆఖరి పేజి) లో తెలియజెసినాను అయితే రాజకోట్ నుండి శ్రీ వి వి ఎస్ శర్మ (Marketing Manager, L I C ) గారి నుండి అనివార్యకారణములవలన సకాలములో మేము అందుకోలేకపోయాము ది 20-4-93వరకు చూచి.. చూచి...చేయ గలిగేదేమిలేక, నిరాశతో "శత సంచిక" post చేయవలసివచ్చింది ఈ సంచికలో ( మే'93 ) భగవాన్ బాబావారి కలర్ ఫోటోను పాఠకులకు అందించుచున్నాను

శత సంచికలో భగవాన్ బాబావారి ఫోటోను అందించలేకపోయినందులకు సహృదయంతో పాఠకులు మన్నిస్తారని ఆశిస్తున్నాను, క్షమించిమని వేడుకుంటున్నాను ఇక పోతే సమయం లేకపోవటం వలన ఈ సంచికను పాఠకులకు తక్కువ పేజీలతో అందించుచున్నాను. మన్నించండి ! జూన్ నెల నుండి మామూలుగా అన్ని శీర్షికలతో శ్రీవాణి పాఠకులకు అందించబడుతుంది. ధన్యవాదములు - సం

ఆశ్చర్యపడి ఆ ఛీఫ్ ఇంజనీరును అడిగాను అంతర్జాతీయ సంస్థ కదా ! ఇతర దేశాలలో మీరు అనేక కట్టడాలు కట్టారుగదా ! ఇంకా ఎక్కడైన ఇటువంటి Achivement వున్నదా ? అని అడిగాను లేదు అన్నారు దీనికి కారణమేమిటని అడిగాను Motivation అన్నారు అనగా ప్రేరణ ఎవరికి వచ్చింది ? ఈ ప్రేరణ ? అని అడిగాను ఆ తట్టలు మోసేవారికి, తాపీమేస్త్రీలకు, ఇతర కూలీలకు అన్నారు వారికి ఎందుకు వచ్చింది ? అని అడిగాను, వాళ్ళు పని చేస్తున్నప్పుడు స్వామి తరచుగా వస్తుంటారు వాళ్ళకు వారు దైవము అనే భావము ఒకటున్నది ఈ హాస్పిటల్ మనది నేను జబ్బుపడితే మాకు డబ్బు లేకుండా రోగ నివారణ ఇక్కడ చేస్తారు అనే ప్రేరణ ఒకటి వారిలో ఏ కాంటినెంటల్ హోటల్‌లోనో, ఏ పార్టీలోనో పాల్గొంటారు అక్కడ రిలాక్సేషన్ ఉంటుంది ఈ కుగ్రామమైనా పుట్టపర్తిలో ఏముంటుంది ? ఒక బారు లేదు సినిమా థియేటర్ లేదు టి వి కూడా సరిగా వుండదు ఆపరేషన్ చేసిన తరువాత మీరు ఏమైతారా? అని అడిగాను అప్పుడు ఆయన నవ్వి మా జీవితం మారిపోయింది ఒరులకు సేవ చేయటంకన్నా, డాక్టరుకు వేరొక ఉద్దేశ్యం ఉండకూడదన్న భావం బాబా మాకు కల్పించారు మేమంతా మారిపోయాం " అన్నారు జర్నలిస్టును కదా ! అంత తేలికగా వదిలే స్వభావం నాదికాదు మీరు మారిపోతే పోయారు మీ పెళ్ళాం పిల్లలూ అన్నాను వాళ్ళు మమ్మల్ని కట్టు

( తరువాయి 23 వ పేజీలో )

# విశ్వమాతవమ్మా నీవు ఈశ్వరాంబా!

—డా॥ డి. ఆర్. ఆచార్య

## సదాచార సంపత్తి

ఈశ్వరమ్మ యొక్క పుట్టినిల్లు మెట్టినిల్లు కూడా సదాచార పరంపరగలవే ఆమె తండ్రి సుబ్బరాజుగారు శివ భక్తుడు శంకరుని ధ్యానంలో కాలం గడుపుతూ ఈశ్వరాలయాన్ని నిర్మించి తనకు గలిగిన కుమార్తెకు ఈశ్వరమ్మ అని నామకరణము చేసి సంతృప్తి చెందాడు ఇక మామగారైన కొండమరాజుగారు దైవచింతనగల మనిషి పురాణ గ్రంథాలను అవగాహన చేసుకోగల భాషా పరిజ్ఞానము ఉంది మహా తపస్వి అయిన వెంకావధూతకు సేవ చేశాడు ఆయన ద్వారా అమూల్యమైన భవిష్యద్వాణిని కూడా విన్నాడు ఒక ముహూర్తాన ఇద్దరూ ఒక వృక్షం క్రింద ఆసీనులైనారు. అవధూత తను చెప్పబోయే దానిని నమ్మతాను అని రాజు చేత ఒప్పించి ఇట్లా చెప్పాడు "చూడు రాజా! సాక్షాత్తు మాధవుడే లీలా మానుష విగ్రహుడై మీ భారద్వాజస గోత్ర వంశములో అవతరిస్తాడు అంతే కాదు, అప్పటికి నీవు జీవించివుంటావు నీ నేత్రాలతో ఆ భగవానుని దర్శించుకుంటావు" అని అప్పటినుండి కొండమరాజు ద్విగుణీకృత ఉత్సాహంతో దైవ ధ్యానంలో కాలం గడుపుచూ అట్టి అవతరణకు ఎదురు తెన్నులు చూస్తూ వున్నాడు తన మనుమడు సత్య పాత మందిరములో వేంచేసి భక్తులను అనుగ్రహించటము చూచాడు అప్పటికి వారికి 95 సంవత్సరములు

ఇక ఆయన సతీమణి లక్ష్మమ్మకు భక్తిప్రపత్తులే గాక వైరాగ్యం కూడ అబ్బినది ఆమె సమిష్టి కుటుంబములో పిన్న పెద్ద కలిసి ముప్పయిమందిదాకా వున్నారు అందరికి వంటా, వార్పు స్నానాలకు పరిచర్యలు అవసరం కదా! ఈ బాదరబందీని నెత్తిన వేసుకోకుండా కోడలికి పెత్తనము అప్పగించి చక్కగా దేవాలయాలనన్నింటినీ తిరిగివచ్చేది ఈ కార్యక్రమము నిత్యము నిష్ఠగా చేయటం వలన సునాయాసంగా జరిగిపోయేది ఆమెకు సత్యనారాయణస్వామి ఇలవేల్పు ఇట్లా ఈశ్వరమ్మ భక్తిమార్గంలో పయనించటానికి అనుకూల వాతావరణము అక్కడ ఏర్పడే వున్నది చిన్న వయసులోనే సమవయస్కురాలైన మహిళను తోడు తీసుకొని సోమవారము శివాలయము, శనివారము అంజనేయస్వామి దేవాలయము, శుక్రవారము గోపాలస్వామి దేవాలయమును దర్శించి పూజలు జరిపేది. ఇంటి పని, ఈ పని కలిసి గంపెడయినా తనకు ఆసక్తి వున్నందున తొందరగా అన్ని పనులు పూర్తిచేసుకొని వచ్చేది పైగా అందుకు తగిన ప్రేరణ, ఆప్యాయత, తన అత్తమామల వలన ఆమెకు లభించేవి ఇక ఇంట్లో మగవారంతా కాస్తో కూస్తో నాటక రంగ ప్రవేశము కలవారే! నిత్యమూ రచన, శ్రుతి లయలతో సంగీత సాధన నూతన గాధలను చదివి విశేషాలను చేర్చటం, వారి నిత్య విధి పవిత్రమైన హృదయం, అందుకు తగ్గ వినయం, ఓర్పు ఇవి ఈశ్వరమ్మకు పుట్టుకతో వచ్చిన వరాలు ఇది పూర్వ జన్మ సంస్కార ఫలితమే ఆధునిక చదువులు లేనందునో ఏమో ఆమెకు కుతర్కాలు తెలియవు ఆమె ప్రగల్భాలకు, ప్రకటనలకు వ్యతిరేకం గోప్యంగా తమ సంసారమేదో తను దిద్దుకొనిపోయే రకం. సగటు స్త్రీకంటే బిడియం ఎక్కువ పూర్తిగా మితభాషి అందువలన ఎంతో పరిచయంతోపాటు నమ్మకము దొరికితేగాని ఎదుటివారితో మాట్లాడేది కాదు తీరుబాటుగా వున్నప్పుడు ఆమె తన అనుభవాల పుస్తకాలను తెరచి ముచ్చటగా చూచుకొని మరల మూసివేసేది.

అందువల్ల ఆశ్రమవాసులైన కస్తూరికి పెద్దబొట్టుకు ఆమెనుండి సమాచారం రాబట్టాలంటే సులభంగా ఉండేది కాదు

## అనాటి స్మృతులు

రామశర్మ అనే పండితుడు తరచుగా బాబా దగ్గరికి వస్తూవుండేవాడు ఆ రోజున స్వామి కొద్దిమంది భక్తులతో ముచ్చటిస్తూ వున్నాడు హఠాత్తుగా, వినయంగానే స్వామిని ప్రశ్నించాడు "మీ అవతరణ ప్రసవమా? లేక ప్రవేశమా" అని అనగానే అక్కడ ఉన్నవారికి ఒక్కసారిగా వాతావరణం మారినట్లు అనిపించింది పైగా ఆ మాటలకు వారికి అర్థం తెలియ లేదు ఆ సమయంలో ఈశ్వరమ్మ అక్కడేవున్నది స్వామి తల్లి వైపుకు తిరిగి "నీవు చెప్పమ్మా. ఆ రోజున బావి దగ్గర నీళ్ళు తోడేటప్పుడు ఏమి జరిగిందో" స్వామి దగ్గరవుండే ఈ అభ్యర్థన చేయ డంతో కాదనలేక ఇన్ని సంవత్సరాలుగా దాచుకొన్న సత్యాన్ని బయటుపరచింది. "మా అత్తగారికి సత్యనారాయణస్వామి కలలో కన్పించారట అందువల్ల అమ్మాయీ, ఏ అద్భుతమైన జరుగవచ్చు నీవు మాత్రం కంగారుపడవద్దు" అని ముందుగానే హెచ్చ రించింది ఆ రోజున నేను నామం చెప్పుకుంటూ బావి దగ్గర నీళ్ళు తోడుకుంటున్నాను అల్లంత దూరాన తేజోరాశి కన్పించింది ఆది నీలపురంగు గోళంగా మారి దొర్లుకుంటూవచ్చి నా గర్భంలో ప్రవేశించింది కొద్దిసేపు స్మృతి లేకపోయినా ముందుగానే హెచ్చరికను విన్నందున త్వరలో కోలుకున్నాను.

ఇట్లాగే పెద్దబొట్టు, అమ్మ గవ్వలాడుతున్నారు చిన్నప్పటి లీలలు ఏమైనా చెప్పమని ఈశ్వరమ్మను బ్రతిమిలాడింది ఆమె సత్యమే చెపుతుందని ఆమె అనుభవము ఎందుకంటే ఒకరోజున స్వామి పుట్ట గానే శేషువు బిడ్డ చాపక్రింద పవళించి తన లొలి సేవను చేసుకున్నాడట గదా! అని అడిగింది అందుకు అమ్మ సమాధానం ఇది "అవును ఇతరులు చెప్పగా నేను విన్నాను. బడలికతో కళ్ళు మూసుకొనివున్నందున గమనించలేకపోయాను. ఆ రోజున మరొక లీల రాబట్టగలిగింది. "బాలసత్య 9 నెలల బాబు. స్నానం చేయించి, బొట్టుపెట్టి, కాటుక దిద్ది, పాలు యిచ్చి, ఉయ్యాలలో పడుకోబెట్టి వంట యింట్లోకి వెళ్ళాను. బాబు కెవ్వున కేకపెట్టి ఏడ్చాడు సాధారణంగా ఏడవడు అందువలన ఆదుర్దాగావచ్చి చేతుల్లోకి తీసుకొని మెడ మీద పడుకోబెట్టుకున్నాను స్పష్టమైన వెలుగు బాబు చుట్టూ వలయాకారంగా ఏర్పడింది అయితే ఆ వెలుగు చల్లగా మాత్రము ఉన్నది కొంతసేపు ఉండి తేలి పోయింది నేను ధ్యానంలోకి వెళ్ళిపోయాను ఇంతలో మా అత్తగారువచ్చి "ఏమిటి అమ్మాయి అలా నిశ్చలంగా కూర్చున్నావు?" అని హెచ్చరిస్తే జరిగిన సంగతి చెప్పాను ఆమె "అమ్మాయీ ఎవరికి చెప్పకు వాళ్ళు సవ్యంగా అర్థం చెసుకోరు పైగా చిలువలు, పలువలుగా కథలు అల్లుతారు" అన్నది ఈరోజు మాత్రం నీకు చెప్పవచ్చును అని బయటపెట్టాను"

ఇట్లాగే మరొక సంఘటన ఈశ్వరమ్మ ద్వారా పెద్ద బొట్టు తెలుసుకోగలిగింది ఆ గ్రామంలో వెంకమ్మ అనే ధనికురాలు ఉన్నది. ఇల్లును ఘనంతిగా వేసుకో వలెనని, ఇటుకను కోయించి బట్టీ పెటటానికి అనువుగా కుప్పలుచేసి పెట్టించింది ఇంతలో ఆరోజు సాయం కాలము కారుమబ్బులు కమ్మినవి పైగా చల్లగా వాన మీద గాలి పెద్ద వర్షమువస్తే ఇటుక అంతా మట్టిమ్ము అవుతుంది. అందువల్ల చెరుకు ఆకులు అయినా తెచ్చి కప్పితే కొంత నయం అని స్నేహితులు సలహా యిచ్చారు ఇంతలో ఒకతను "నా చేలో చిత్రావతీ నదికి అవతల ఒడ్డున ఆకు ఉన్నది. తెచ్చుకోవచ్చు" అని అనుమతి యిచ్చాడు ఇంకేం గ్రామంలోఉన్న పిన్న, పెద్ద అంతా నదికి అడ్డంగా గొలుసులైను కట్టి ఆకు చేతులమీదుగా అందుకోవటానికి సిద్ధపడ్డారు అందులో మన చిట్టిసత్య ఒకరు అతడు అందరి మధ్య లోనికి వెళ్ళి తన బజ్జి చేతిని ఆకసము వైపుకు తిప్పి

" వెంకమ్మా ! ఇక వానరాదు అన్నాడు. అంత పెద్ద గాలివీచి మేఘాలు ఎక్కడికక్కడ చెల్లాచెదరు అయిపోయినవి వాళ్ళు అందరూ బాబు మాటను నమ్మి వెళ్ళిపోయారు అందుకు కారణం ఉన్నది సత్య మాటలు, చేష్టలతో వాళ్ళకు అనుభవము ఉన్నది వారు అటువంటి దివ్యశక్తులు బాబువద్ద చూశారు చింతచెట్టు నుండి పిల్లలు కోరిన ఫలమెల్లా కోసి ఇచ్చాడు ఉయ్యాల ఊగుతూ దత్తాత్రేయునివలె దర్శనమిచ్చాడు ఖాళీ సంచిలోనుండి స్వీట్సు పంచి యిచ్చాడు పెద్ద బొట్టు అన్నది " ఈ అవతారంలో గోవర్ధనగిరితో అవసరం లేకపోయింది " అని ఒకరోజు గ్రామంలో దేవుణ్ణి ఊరేగిస్తున్నారు బాబు ఎక్కడా కనబడుట లేదు. అతని తోటి ఆడుకునే పిల్లలంతా ఊరేగింపు ముందు ఉన్నారు నాలుగు దిక్కులా చూస్తే బండి మీద దేవుని ప్రక్కనే కూచుని నవ్వుతూ హారతులు అందుకుంటున్నాడు బాబు.




## మాతృప్రేమ

"అవును సత్య నా బిడ్డ రక్తం పంచుకొని పుట్టాడు పాలుత్రాగి పెరిగాడు. ఎంతమంది పిల్లలలో ఉన్నా చుక్కల్లో చంద్రుడులాగా ఉంటాడు వికసించిన పద్మంలా ఆ ముఖము, విశాలనేత్రాలు, దొండపండు లాంటి పెదవులు, సొంకంగాఉన్న అవయవాలు, ఆవరంలో ఉన్న దోగాడే కృష్ణుడు లాగానే ఉంటాడు అయితే బాబుకు, యశోదా నందులవలె సొమ్ము పెట్ట లేకపోయాము బాబు ఊకెళ్ళ కొడుతూ వుంటే ముద్దుగా ఉందని తమ పిల్లలను వదలికూడ పిల్లలు వచ్చేవారు రాగానే బాబు చేతులు చాచేవాడు బాబుకు లేని అంటూ, సొంటూ నాకెందుకని వదలుతున్నాను బాబును వదలి ఒక్క క్షణం వుండలేను కాని సాగేసి కాదు. మామ గారి దగ్గరకు అని అత్తగారు తీసుకునేది ఆయన పూజా పీఠంమీద కూచోపెట్టి ధ్యానం చేసుకుండేవారు ఆదేమి చిత్రమోగాని అక్కడ బాలసత్య ఏడవడు అల్లరి చేయడు. మురికి చేయడు. పైగా మామగారు అనేవారు "సత్య ఉన్నప్పుడు నాకు ఏకాగ్రత బాగా కుదురుతుంది" అని ఇక ప్రక్కయింటి కరణం సుబ్బమ్మ సరేసరి బాబు ఆమె దగ్గరే ఎక్కువగా వుంటాడు దోగాడే స్థితిలో అక్కడ కేరింతలు కొడుతూ ఆడుకునేవాడు అక్కడ వుంటే నాకు నిశ్చింతే ఇది చేయలేదు, అది చేయలేదు, అనే భయంలేదు అన్నీ ఆమె చూసు కొంటుంది ఒకరోజున ఏమి చేస్తున్నాడో చూద్దామని వెళ్ళాను " ఆ ! మీ నందకిశోరుడా ! ఈ వరండా పావనం చేస్తున్నాడు " అన్నది ( ఒకరోజున ఏమి చేస్తున్నాడో చూద్దామని) నరొకసారి వెళ్ళితే ఏదీ సీకు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు పచ్చగా పాడుఅన్నది. నేను "రాముని వర్ణింప తరమా ! " అని ముగించాను. వెంటనే అందుకొని సుబ్బమ్మగారు " యీ రాముని వర్ణింప తరమా ! " అని పాడింది మమకారంలో యశోదకు తీసిపోదు. ఇక ఈ రత్నాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలె ఆనాటి కృష్ణునికి ఎన్ని గండాలు తలచుకుంటే గుండె దడదడలాడుతుంది. బాబుకు

నేనేమో దిగదుడుపులు తీస్తూవుంటే ఏమిటి ఈ చాదస్తం అంటారుగాని "ఆ రోజున ఏమి జరిగింది? పూతన విషము పూసుకొని పాలిచ్చి కృష్ణుని చంపటానికి వచ్చింది. తనే చచ్చి పెద్ద ఆకారంతో పడిపోయింది అంటే బాలకృష్ణుడు హతమార్చినట్టేగా అయినా బాలుడు జడుసుకున్నాడేమోనని ఎన్ని రక్షలు, ఎంత హంగామా ఒక్కొక్క దేవతను ఆహ్వానించి, కృష్ణుని ఒక్కొక్క అవయవాన్ని రక్షించమని, మంత్రాలతో తాయెత్తులు కట్టారు. తల్లి హృదయం యితరులకు ఎట్లా అర్థమవుతుంది?

సత్య చాల త్వరగా పెద్దవాడు అయినట్లుంది నిన్న గాక మొన్న ఉయ్యాలలో పడుకోబెట్టినట్లే వుంది ఇప్పుడు బుక్కపట్నం బడికి పోవాలె అది నది అవతల ఒడ్డున ఉన్నది బాబు బడికి వెళ్ళి మరల తిరిగి వచ్చేదాకా తోచేది కాదు బాబు అందానికి తగినట్లు ఉండాలని బట్టలు బాగా శుభ్రంగా చేసి తొడిగేదాన్ని. వచ్చేటప్పటికి అంతా మురికే. ఏమిటీ మురికి బాబు అంటే సమ్మోహనంగా ఒక నవ్వు నవ్వేవాడు తరువాత, ఇతరులవల్ల జాగ్రత్తగా తెలుసుకుంటే అసలు సంగతి బయటపడింది వాళ్ళ దుస్తులు కంటే, సత్యం దుస్తులే బాగుండేవని, అందుకని ఇసుకలో పడేసి ఈడ్చేవాళ్ళట ఎంత ఓర్పోగాని బాబు పితూరీలు చెప్పేవాడు కాదు సత్యం కొంచెము పెద్దవాడు అవుతున్నకొద్దీ సమస్యలు ఎదురు అయినవి. సాయం కాలం పిల్లలతో దాగుడుమూతలాడుతూ పోయి, పోయి ఏ ఎద్దునో, ఆవునో పట్టుకొనేవాడు నా గుండె విలవిల లాడిపోయేది అది పొడిస్తే బాబు ఏం కావాలి? నేను ఏం కావాలి? అటువంటి సమయాలలో నాకు అలంబన కరణం సుబ్బమ్మగారు ఆమె నమ్మకమే నమ్మకం, నిబ్బరం "చూడు ఈశ్వరి ఆ పోట్లగిత్త కూడ అగి నెమ్మదిగా సత్య స్పర్శను ఎంత ఆనందంగా అనుభవిస్తుందో మన సత్య గోవిందుడే! అనేది ప్రతి రోజు ఏదో ఒక మంచివార్త, వెంటనే అద్భుతమైన చేష్ట ఆ సాహసం చూస్తే ఎవరికి భయం వుండదు. ఆ మధ్య ఎవరో వచ్చి నీ పేరేమని అడిగితే సత్య అన్ని పేర్లు నావేనని అంటాడు దాన్ని వాళ్ళు అర్థం చేసుకుంటారా! ఇక గ్రామంలో పిల్లలకు పండరి భజన చెప్పి వాళ్ళకు గురువైనాడు స్కూల్లో కూడ సత్య ప్రార్థనా పద్యం చదివిన తరువాతనే పాఠాలు ప్రారంభిస్తారట సుబ్బమ్మగారి భర్త హిట్లర్ మీసం పెట్టి గర్వంగా ప్రదర్శిస్తూవుండేవాడు ఇంకేముంది ఆయన మీద వ్యంగంగా పాట వ్రాసి అంతటితో ఊరుకోక పిల్లలను పిలచి వాకిట ముందర చదవమన్నాడు ఎంతవరకు? ఆ దుబ్బ పోయేవరకు "ఇటువంటి అస్త్రం యశోదవంటి సుబ్బమ్మ భర్త మీదనా? నాకు కాలు చెయ్యి ఆడలేదు నేను పరుగెత్తుకొని వెళ్ళి "సుబ్బమ్మా! నీ కొడుకుని నీవు అదుపులో పెట్టవలసిందే నా వల్ల కాదు అన్నాను ఆమె సమాధానం ఇట్లా ఉంది "తొణికే మనిషి కాదు. నీవేమి భయపడకు మనకు ఏది అవసరమో, ఏది అనవసరమో మనకంటే సత్యకే బాగా తెలుసు" అన్నది. ఇంకొకసారి ఊళ్ళో వున్న మోతుబరులమీద పదం కట్టి గొడ్ల వెంబడి పోయే పిల్లలను పాడమన్నాడు తొలుత ఈ విప్లవ కవిత్వం ఎవరిదో అర్థం కాలేదు వాళ్ళకు ఆరాలు తీసి దీనికి కర్త మాసత్య అని తేల్చారు. నేనూ, సుబ్బమ్మా ఏమవుతుందో అని చేతులు పిసుక్కుంటూ కూర్చున్నాము వాళ్ళ పిల్లలేమో ఈ బాల గురువు వద్ద శిష్యులు అందువల్ల ఏమీ చేయలేక దిగమింగి ఊరుకొన్నారు వాళ్ళు శ్రామికులచేత పనులు చేయించుకొని కూలి ఇవ్వకుండా రేపు రా, మాపు రా అని ఇవాళ శుక్రవారం, ఇవ్వాళ ఆదివారం ఇవ్వకూడదు అని ఇష్టము వచ్చినట్లు తిప్పేవారు. ఈ సంఘటన తర్వాత కొంత మార్పు వచ్చింది ఇంతలో మరొక వార్త. స్కూలు వార్షికోత్సవం జరుగుతున్నది సాంస్కృతిక కార్యక్రమాలలో బెంగుళూరు ఋష్యేంద్రమణి నృత్యముంది అని కరపత్రాలు ఉపాధ్యాయులు కొట్టించారు. ఆ రోజులలో ఆమె ప్రసిద్ధ

నర్తకి, అందువల్ల జిల్లా అధికారులు మొత్తం, ఇతర పెద్దలు దూరాన్నుండి వచ్చారు అనివార్య కారణాల వల్ల నేను రాలేను అని ఋష్యేంద్రమణి వర్తమానం పంపింది ఇంకేముంది హెడ్ మాష్టర్, ఉపాధ్యాయుల ముఖాలు వెలవెలబోయినవి. వాళ్ళకు ఏ కార్యక్రమమైనా ప్రారంభించటానికి ధైర్యం చాలటం లేదు అపుడు సత్య "మాష్టారూ ఆ నృత్యం నేను చేస్తాను మీరు భయపడవద్దు" అన్నాడట ఎట్లాగో ఆపద్భాంధవుడు దొరికాడు అని సత్యకు ఆడవేషము వేసి స్టేజీ మీదకు పంపారట. 'అద్భుతంగాఉంది నాట్యం' అందరూ ఈ అమ్మాయియే కాబోలు ఋష్యేంద్రమణి అని అనుకొన్నారట ప్రోగ్రాము అయిపోయిన తర్వాత ఉపాధ్యాయులు లాగు, చొక్కా పిన్నీసులు పెట్టుకున్న సత్యను అధికారులకు పరిచయం చేస్తే, వారు ముక్కు మీద వేలువేసుకున్నారట అంతవరకు ఆశ్చర్యంగాను సొంపుగాను ఉంటనుకోండి కాని నాకు ఎవరి కళ్ళు ఎట్లాంటివో అని భయం వుండదూ? ఇంతలో మరొక వార్త ఆ గ్రామంలో అందరికి సత్య మామూలు బాలుడు కాదు, మహిమలు ఉన్నవి అని ఋజువయింది నాకు మాత్రం చెడ్డ వార్తే క్లాసులో కొండప్ప అనే మాష్టారుగారు పిల్లలకు నోట్సు చెపుతున్నారట అందరూ బుద్ధిగా వ్రాసుకొంటున్నారు మన సత్య తప్ప ఎందుకు వ్రాసుకోవటం లేదు? అని అడిగారు మాష్టారు నాకు అవసరం అనిపించలేదు అని సమాధానం ఇదేదో పెడసరి అయిన సమాధానంగా, మరియు తనకు నామర్దాగా ఎంచి ఆ మాష్టారు సత్యను బెంచీ మీద నించోపెట్టారట. పీరియడ్ అయిన తర్వాత ఆ పంతులుగారు లేవబోతే కుర్చీ అంటుకుపోయింది. అందువల్లలేవనూ, ఆగనూ, ఇట్లా అవస్థ పడుతున్నాడు. తరువాత పీరియడ్ మాష్టారు వచ్చి సంగతి గ్రహించి ఆ బెంచీ మీద పిల్లవానిని దిగమనండి అని దింపి ఆయనకు విముక్తి కల్గించారట. మరి నా భయం, మాష్టర్లు అంతా ఒక్కటై సమ్మెచేసి ఏ స్కూలులో చేర్చుకోకపోతే? కొన్ని రోజులకు కొండప్ప మాష్టారు "సత్య మహిమలు" అంటూ పద్యాలు వ్రాసి పంచిపెట్టిందాకా, నా మనస్సు, మనస్సులో లేదు కృష్ణుడు సాందీపుని అవమానించాడా? ఇంట్లో వాళ్ళందరికి ఇదే అనుమానం అయితే నా అమాయకత్వం బయలుపడ్డ రోజు కూడ వుంది ఒకసారి పర్తిలో కనకతార నాటకం వేస్తున్నారు సత్య అందులో నాయకుడు అతను చేయని నేరానికి శిక్ష పడుతుంది అందుకు అమలు చేసే సన్నాహాలు చేస్తున్నారు నాకు తల తిరిగింది స్టేజిమీదకు పరుగెత్తుకొని పోయాను అందరూ 'ఇది నాటకముగదమ్మా' అని తల్లిమన్నారు నాటకమో - బూటకమో నా కండ్లతో చూచి ఓర్చుకోవాలిగదా, గుండె నిబ్బరం చాలదుకదా! తల్లి తన ప్రాణాన్ని పణంగా పెట్టి అయినా బిడ్డను రక్షించుకోవాలిగదా ఆ సీను చూచి ఏ తల్లి సంతోషిస్తుంది? ఇంతలో పెనుగొండలో పెట్టిన పరీక్షలలో సత్య ప్రధముడుగా వచ్చాడు సత్యను పెద్ద ఊరేగింపుతో తీసుకొని వచ్చారు

మా పెద్ద కుమారుడు శేషంరాజు ఉరవకొండ హైస్కూలులో తెలుగుపండితుడుగా పనిచేస్తున్నాడు. సత్యను అక్కడ చేర్పించమని అంటాడు. సత్య తెలివైనవాడు అతడు పెద్ద కవి కావచ్చు లేకపోతే నటకుడు కావచ్చు ఏది మాట్లాడినా నిత్య, సత్యంగా ఉంటుంది అధికారయుతంగా ఏదో ఒక పరదేవత చెప్పినట్లుగా వుంటుంది నాకు దూరమౌతాడని, పంపించకపోతే అతని అభివృద్ధి నేను ఆపినట్లు అవుతుందేమో చివరకు ధైర్యం చిక్కబట్టి ఉరవకొండకు పంపించాము కొన్నాళ్ళు గడవగానే పిడుగులాంటివార్త రానేవచ్చింది "పిల్లవాడికి తేలు కుట్టింది అనుకుంటాము" ఇప్పుడు స్పృహ వచ్చింది కాని మనలో లేడు ఏదో మాట్లాడుతున్నాడు అని సరే ఇంటికి తీసుకువచ్చాము తలా ఒక మాట తలా ఒక సలహా పిల్లవాడు వేదాంతం మాటలు మాట్లాడుతుంటే ఇంకా అనుమానం ఏమిటి? తప్పక చదువుకున్న దయ్యమే అయివుంటుంది ఇది

అందరి మాట మా ఇంట్లోవాళ్ళమాట దయ్యాల పేరుతో బాబును బాగా హింస పెట్టారు చివరకు తగాదా పెట్టుకొని ఇంటికి తీసుకొనివచ్చాము ఎటు తిరిగి మా మామయ్య కొండమరాజుగారు ఒక్కరే "అబ్బాయి! ఇది దయ్యము కాదు రాముడు కూడా ఇట్లాగే కొన్నాళ్లు నిర్లిప్తంగా, తమ్ములతో గదిలో కూర్చొని తలుపులు వేసుకునేవాడట' అన్నాడు కాని పెద్దవాడు అయిన ఆయన మాట ఎవరు వింటారు? పైగా తగిన దయ్యాల వైద్యము చేయలేదని నిర్లక్ష్యము చేస్తున్నామని ఆరోక అంవాదు చివరికి ఒక రోజు రసాభసమే అయింది సత్య తండ్రి ఒక దుడ్డుకర్ర తీసుకొన్నాడు దగ్గరకు వచ్చాడు "పిల్లలకు కలకండ వగైరాలు పంచిపెట్టి మమ్మల్ని మోసం చేయాలనుకుంటున్నావా? ఇప్పుడు చెప్పు దయ్యానివో, భూతానివో, పిచ్చివాడివో? ఈ దెబ్బతో నీవు మా బాబును వదలి వెళ్ళిపోవాలి" అంటూ కర్ర ఎత్తాడు అంతకంటే నా తల పగులగొట్టినా బాగుండేది దేవుళ్ళందరికి మొక్కుకున్నాను ఆ కర్ర బాబు తలమీద వాలకూడదని. సత్య బెదిరిపోలేదు "నేను దయ్యాన్నికాదు, భూతాన్నికాదు సాయిబాబాను" అన్నాడు. ఆ పేరు అందరికి కొత్త ఆశ్చర్యమే అందరిలో చోటు చేసుకున్నది. కర్ర కింద పడి పోయింది నేను ఊపిరి పీల్చుకున్నాను. కొన్నాళ్ళ తర్వాత ఒక పెద్దమనిషి వచ్చాడు "అబ్బాయి! నీవు వెంకమరాజు, ఈశ్వరమ్మ కొడుకువు అని మాత్రమే మాకు తెలుసు కాదు నేను సాయిబాబాను అంటున్నావు ఏది మాకు నిదర్శనం చూపించు అని అడిగాడు బాబు నన్ను కొన్ని పూలు తెమ్మన్నాడు ఏమి చేయబోతు న్నాడో నాకు తెలియదు. వణుకుతూ అందుబాటులో ఉన్న మల్లెపూలు దోసిలినిండా తెచ్చియిచ్చాను వాటిని విసురుగా క్రింద చల్లాడు అవి చెల్లాచెదరుగా ఉన్న వల్లా దగ్గరగా చేరి అక్షరములుగా కూర్చుకొని 'సాయి బాబా' అని వ్రాసినట్టు చూపించినవి. బాబు మీద దౌర్జన్యము ఆగిపోయినది గ్రామములో అందరూ గురువారమునాడు ఇండ్లు అలికి, శుభ్రము చేసుకొని సాయిబాబా చెప్పినట్టు నడుచుకునేవాళ్లు బయలుదేరారు. మరల మా శేషమరాజుఅందరిని పప్పించి ఉరవకొండ స్కూలులో చేర్పించాడు అక్కడ కూడ బాబు చేసే మహత్తులు కథలు, కథలుగా చేరినవి అక్కడ ఆంజనేయులుగారు ఉన్నారు ఆయన సాయిబాబా భక్తుడైనాడు

మరల ఉరవకొండనుండి క్రొత్త వార్త "మీ కుమారుడు పుస్తకాలు విసిరివేశాడు స్కూలు మాని వేశాడు నా భక్తులు పిలుస్తున్నారు" అని గురువు వేషంలో వున్నాడు చుట్టూ శిష్యులు చేరారుకూడ మీరు రండి" మేమిద్దరము ఆదరాబాదరా వెళ్ళాము. "సాయిబాబా మాతాపితరులకు జై" అనే జయజయ ధ్వానాలు మిన్నుముట్టినవి బాబును ఒక కుర్చీలో కూర్చోబెట్టారు ప్రక్కన మెడలోవేసి తీసిన దండల కుప్ప వున్నది ఇంకా పూలమాలలు వేసేవాళ్ళు వస్తున్నారు. కొందరు ఆ కార్యక్రమమును అజామాయిషీ చేసి త్రొక్కిసలాట లేకుండా చూస్తు న్నారు వీళ్లు రెండు రోజులైనా ఈ తతంగము ఇట్లాగే నడుపుతూవుంటారని నాకు తెలుసు. నా తండ్రి అన్నం తిన్నాడో లేదో అని కనుక్కునే దిక్కు వుండదు నా దగ్గర ఉన్నప్పుడు ఎంత బాగున్నాడు? డొక్కలు బయటపడ్డవి ఇప్పుడు వీళ్ళ కేకలతో నాకేమి పని? భయంగానే తిన్నగా దగ్గరికి వెళ్ళాను నా కండ్లు వర్షిస్తున్నవి. నన్ను చూచి మాయ వచ్చింది అన్నాడు అందరూ వింతగా చూచారు ఇంతలో "ఆంజనేయులుగారి ఇంటి దగ్గరికి పోవాలి" అని బయలుదేరపోతున్నాడు నా బాబు అసలు ఆహారం తీసుకొని ఎన్నాళ్ళయిందో! దబాదబా వంట యింట్లోకి వెళ్ళాను. అన్నిరకాల కూరలతో వంట మొదలు పెట్టాను ఎవరో బాబుకు చెప్పారు "మీ అమ్మ అన్నం వండుతూవుంది కొంచెము అయినా తినిపో" అని ఏ ధ్యానలో ఉన్నాడో సరేనన్నాడు చేసిన పదార్థాలన్ని విస్తట్లో వడ్డించి ప్రక్కన నుంచున్నాను

బాబువచ్చి కూర్చున్నాడు నన్ను పిలిచాడు అన్ని పదార్థాలు కలిపి మూడు ముద్దలు చేశాడు నా చేతిలో పెట్టి అందించమన్నాడు నాకు వణుకు ఎక్కువవుతూ ఉన్నది ఈ వింత పద్ధతి చూచి మళ్ళీ " ఏ బ్రహ్మ రాక్షసో పట్టింది, " అనరు కదా ! మూడు ముద్దలు తిన్నాడు "మాయ వీడింది" అన్నాడు చుట్టూవున్న జనంతో బయలుదేరి ఆంజనేయులుగారి ఇంటి ముందర వున్న బండమీద కూర్చొన్నాడు నేను వెంట వెళాను అందరికీ " మానస భజరే గురుచరణం " అని చెప్పు చున్నాడు అందరూ శ్రద్ధగా పలుకుచున్నారు నేను దగ్గరకు వెళ్లాలంటే ఒకే మార్గము తోచి ది వాళ్ళలో నేను చేరాను గొంతు కలిపాను. బాగా పొద్దుపోయిన తర్వాత జనం పలచబడ్డారు భయం, భయంగానే దగ్గరకు వెళ్లాను ఇప్పుడు నాకు వెనుకవున్న చనువు పోయింది ఏమి మాట్లాడితే ఏమి పొరపాటు జరుగు తుందోనన్న భయం ఒక వంక ఒకవేళ సన్యసించి ఏ హిమాలయాలకో పోయి ఆకు, అలము తింటూ కౌపీనము పెట్టుకొని, కమండలము పట్టుకొని, గడ్డం పెంచుకొని, వుంటాడనే కీడు శంకించింది "అబ్బో ! ఆ దృశ్యాన్ని వూహించలేను ", తిన్నగా యిట్లా అన్నాను బాబూ ! నీవు సాయిబాబావే కావచ్చు మేము మాయలో ఉన్నాము మాకు తెలియదు నీకు, నీ శిష్యులకు మేము స్వాగతం పలుకుతాము. సేవ చేస్తాను మీ పంథాకు అడ్డురాము పుట్టపర్తిని నీ స్థాన ముగా చేసికో నా కండ్ల ఎదుట వుండు తల్లిగా నేను కోరేది అదే దయ దలచాడు "అట్లాగే" నని ఒప్పుకున్నాడు

## తొలి విజయం

తెల్లవారగనే జనం మేడల్లోనుండి, పాకలలోనుండి బయటకు వచ్చారు. గుమిగూడారు ఊరేగింపుకు బారులు తీరారు సాయిబాబాను బండి ఎక్కించారు తల్లిదండ్రులకు పూలమాలలు వేశారు ఊరేగింపుగా పుట్టపర్తికి బయలుదేరారు పర్తి చేరగానే సుబ్బమ్మగారు తన విశాల భవనాన్ని తన సత్యకు, శిష్యులకు తెరచింది. అక్కడ అందరూ వున్నారు అందరికీ భోజనాది సౌకర్యాలు ఆమె కల్పించింది " సత్యనారాయణ సాయిబాబాగా మారాడు " అనే వార్త అంతటా వ్యాపిం చింది ఇక నిత్యము " దయ్యాలు పట్టినవి " అని వచ్చేవాళ్లు, శారీరక జబ్బులున్నవాళ్ళు, దురదృష్ట వంతులు సాయిబాబాను దర్శించి ఆయన ఆశీర్వచనము పొంది కష్టాలు తీర్చుకోవటానికి వస్తున్నారు రాను రాను బెంగుళూరు, మద్రాసు, తంజావూరు, కుప్పం ల నుండి భక్తులు వస్తున్నారు ఆ యిల్లు చాలలేదు ప్రక్కన రెండు గదులు వేయించింది అవీ చాలలేదు ఇక పాకలు వేయించింది. సుబ్బమ్మ తన నంద కిశోరునికోసం, వచ్చినవాళ్ళకు రాత్రనక, పగలనక వంటా, వార్పు వడ్డన చేస్తూ ఉండేది ఎప్పుడూ రుబ్బుతూనో, దంచుతూనో, చెరుగుతూనో వుండేది. రోజులు గడిచేకొలది వచ్చినవారిలో కొందరు ఆమె సేవలో భాగం పంచుకొని తలా ఒక పని పూర్తిచేసే వాళ్ళు ఇప్పుడు దానిని పాత మందిరము అంటున్నారు కొత్తగా ప్రశాంతినిలయం వెలసింది గనుక. ఏవో ఒకటి రెండు చిన్న సంఘటనలు మినహా అక్కడ ఈశ్వరమ్మకు సంతృప్తిగానే వుంది బాధితులను ముందుగానే తన చల్లని మాటలతో పలుకరించేది వాళ్ళకు సగము స్థిమితము చిక్కేది ఆత్మీయంగా పలుకరించేవారు లేక మానసిక వ్యాధులు వచ్చేవి దూరాన్నుండి కొందరు భక్తులు వచ్చేటప్పటికి చిత్రావతీనది వరదలలో ఉండేది స్వామి ముందుగానే ఫలానావారు వస్తున్నారు జాగ్రత్తగా తోడి తెమ్మని గజఈతగాళ్ళనుపంపేవాడు వచ్చేవాళ్లకు ఈశ్వరమ్మకు కూడ వాళ్ళు ముందుగా వ్రాయలేదే ! స్వామికి ఎట్లా తెలిసింది? అని అనుకోవటమే తడవుగా వారిలో భక్తి భావము ఇనుమడించేది బుక్కపట్టణంలో చిన్న ఆశ్రమము నిర్మించుకొని ఒక యోగి వుండేవాడు. ఒక రోజున తన పథకం ( వినిపించాడు ) వివరించాడు. " ఈ బాబును తనకు అప్పగించితే ఇంకా పేరు

ప్రతిష్ఠలు రాగలవు ఆశ్రమమునకు చెందిన యావదాస్థి తన తదనంతరము బాబుకే చెందుతుంది ” అని : ఈశ్వరమ్మకు అందులో ఏదో వ్యాపారధోరణి కన్పించింది "సాయిబాబా పుట్టపర్తి వదిలిపెట్టడు, తనను వదిలిపెట్టడు ” అని తెగేసి చెప్పింది ఇక తర్వాత కొన్ని అద్భుతమైన సన్నివేశాలు జరిగినవి. మహారాష్ట్ర నుండి సాయిబాబాను చూడటానికి ఆరుగురు వచ్చారు అందులో ఒకాయన కృష్ణభక్తుడు అతడు తన తలను సాయిబాబా ఛాతీకి ఆనించగనే ముల్లోకాలను సమ్మోహితులను గావించిన మురళీనాదం వినిపించింది అతడు వచ్చి ఈ అద్భుతాన్ని ఈశ్వరమ్మకు చెప్పాడు తల్లి అదును చూచి అడిగింది “ షిర్డీసాయి వేణువును ఉపయోగించాడా ? ” అని "అవును" ఉపయోగించాడు అని సాయిబాబా సమాధానం చెప్పాడు “ కృష్ణావతారంలో వున్నది, ఇప్పుడు ఉన్నది" ఆమెకు పూర్తిగా అర్థం కాలేదు ఒకరోజున సాయిబాబా తన తల్లిని ఒక గదిలోనికి తీసుకొనివెళ్ళి అక్కడి దృశ్యము చూడమన్నాడు 'అల్లంత దూరాన ఒక మసీదు, దానిముందు కఫ్నీ వేసుకొని ఒక వృద్ధుడు కూర్చొనివున్నాడు షిర్డీసాయి ఎలా ఉంటాడో చూడటం జరిగింది మద్రాసు వగైరా పట్టణాల నుండి వచ్చే ధనికులు సాయి పుట్టు పండుగనాడు తమ ఆభరణాలను ఉంగరాలతో సహా ఆయనకు అలంకరించేవాళ్ళు తర్వాత పల్లకీలో ఊరేగించేవాళ్లు ప్రతి ఇంటిముందు హారతులు ఇచ్చేవారు సాయి ముఖము నుండి విభూతి, కుంకుమ రాలి కుప్పలుగా పల్లకిలో పడేది

రానురాను జనం ఎక్కువైనారు. సాయికి కొండ దగ్గర క్రొత్త మందిరం కట్టించి దానికి “ ప్రశాంతి నిలయం" అని పేరు పెట్టాలని అనుకున్నారు తొలుత తల్లికి అంత ఇష్టంగా లేదు కారణమేమిటంటే అక్కడ ప్రదేశమంతా అడవి, తేళ్ళు, పాములమయము పైగా వూరికి దూరము కాని మొదలుపెట్టారని ఆమెకు తెలుసు. ఆ ప్రవాహానికి తాను దోసిలి అడ్డుపెట్టినా ఆగదు అని గ్రహించింది. కట్టుబడి జరిగినంతవరకు సేవాదళం వాలంటీర్లతో కలసి, ఇసుక, ఇటుక చేరవేయటం బాగుచేయటంవంటి పనులలో పాలుపంచుకొని శ్రమపడ్డది తర్వాత కొండమీద ఆసుపత్రి అది కట్టిన తర్వాత అమ్మ సేవ విస్తృతమయింది పిల్లలకు తాను దగ్గరవుండి పట్టుకొని ఇంజక్షన్లు చేయించేది ‘‘ బాధలు చెప్పటం వాళ్ళకు చేతకాదని తాను వివరించేది కాన్పుకేసులు వస్తే దగ్గర ఉండి, కాన్పు అయిందాకా, జాగ్రత్తగా సహాయంచేసి వైద్యము చేయించేది. ఇప్పుడు సాయి ఆమెను “ గృహం అమ్మాయి ” అని పిలుస్తున్నాడు "పోనీలే గృహానికి సంబంధించిన మనిషిగా చూచినా చాలు" అని అనుకొన్నది రోజు దేశ విదేశాల నుండి ఎన్నో వేలమంది సాయికొరకు వచ్చి తృప్తి చెంది వెళ్ళుచున్నారు సనాతన సారథి పత్రికలు సముద్రాలు దాటి పోతున్నవి వాటిని ఒక ప్రసాదంగా స్వీకరిస్తున్నారు భక్తులు సాయి తన ఆధ్యాత్మిక అభివృద్ధికి ఎలా తోడ్పడుతున్నదీ, నిత్యము ఎంతటి శ్రద్ధ తీసుకొంటున్నది ఆమె అర్థము చేసుకొన్నది స్వామి చెప్పే సత్య ధర్మాలను తాను కూడ తు చ తప్పకుండా అనుసరిస్తున్నది అప్పుడప్పుడు సూక్తులను జ్ఞాపకము వుంచుకుంటున్నది. తనను “ గృహం అమ్మాయి” అని పిలవటం ఆమెకు తప్పుగా తోచలేదు ఎందుకంటే తనకు ఒక పురాణ గాథ జ్ఞాపకము వున్నది విరాటరాజు ఉత్తర వివాహానికి వచ్చిన బంధువులకు వసతులు చూపిస్తున్నాడు. ఆ వివాహానికి దేవకీ, వసుదేవులు కూడ వెళ్ళారు వారు రాజుగారితో ఇలా అన్నారు “ రాజా ! మేము శ్రీకృష్ణుని తల్లి దండ్రులమని ప్రత్యేక శ్రద్ధ తీసుకోవద్దు. అతని "తల్లిదండ్రులము" అనే పదం ఇచ్చే గౌరవం మాకు చాలు కృష్ణుడు మావాడు అని మేము చెప్పుకోలేము. ఆయన అందరివాడు ” అని ఆ వయస్సులో అమ్మ సేవాదళంతోపాటు శ్రమపడుతూ వుంటే వచ్చే జనానికి ఇప్పుడు అర్థమవుతూ ఉన్నది. “ సాయి ఈ తల్లిని

ఎందుకు ఎంచుకున్నాడో " అని తాను సాయికి గృహం అమ్మాయి మరి తన ఏ పేరుతో పిలిచి దగ్గిరికి వెళ్ళాలి ఇప్పుడు సత్యనారాయణ కాదు సాయిబాబా ఆ పేరు ఏదోలా ఉంది ఆమెకు కొత్త మనిషి దగ్గిరకు పోయినట్లు అనిపించింది కుప్పం నుండి వచ్చినవాళ్ళు స్వామి అని అంటున్నారు చిన్నమాట తనకు బాగుంటుంది మనవాళ్ళ ప్రతి దేవుని పేరు చివర స్వామిఅని చేర్చటం కద్దుగదా కాబట్టి అట్లా సంబోధించటము అలవాటు చేసుకొంటున్నది.

స్వామి తూర్పు ఆఫ్రికాకు వెళ్ళనున్నారని తెలిసింది. గబగబా స్వామి దగ్గిరకు వెళ్ళింది 'అక్కడ మనుష లను తినేవాళ్ళు ఉన్నారు' అని ముందుగా చెప్పి ఆమెకు ఒక షాక్ థెరపీ ఉపయోగించారు తర్వాత సందేహా లను పోగొట్టి స్థిమితపరచారు. పూర్తిగా ఆందోళన తగ్గకపోయినా, ఒప్పుకోక తప్పలేదు స్వామి సంక ల్పిస్తే ఆగదని ఆమెకు తెలుసు ఎందుకంటే వెనుకటి అనుభవం చెప్పిన పాఠం అది స్వామికి చిన్నప్పుడు తేలు కుట్టింది అప్పటి నుండి ఆయనలో మానసికంగా మార్పు వచ్చింది అది బాగు చేయించటానికి ఎన్నో పాట్లు పడ్డారు అందులో ఒకటి ఎవరో వైద్యులు ఫలానా చోట ఉన్నారు అని తెలిసి బండి కట్టుకొని, అందులో తల్లిదండ్రులు, బాబు కొంత సామాను చేర్చుకొని వెళ్ళుచున్నారు స్వామికి ఇష్టం లేదు కాని తండ్రి గద్దించాడు. ఎద్దులు కొంత దూరం వెళ్ళి నిజంగా భూతాన్ని చూచినట్లు బెదిరిపోయి, అమాంతంగా వెను దిరిగి, ఎంత తిప్పాలన్నా తిరగక, వురుకులు పరుగు లతో, ఇంటికి చేరినవి వాటిని ఆపటానికి ఎవరు చేసిన ప్రయత్నము ఫలించలేదు స్వామి ఆఫ్రికానుండి తిరిగి వచ్చిన తర్వాత కస్తూరి అక్కడ జరిగిన సంగతులు వివరిస్తూ ఉంటే శ్రద్ధగా విన్నది పైగా అక్కడఉన్న సేనాపతుల పిల్లలు నలుగురికి పోలియో వచ్చి, కాళ్ళు పడిపోయి, స్వామి వద్దకు చక్రాల బండ్లలలో వచ్చారు స్వామి స్పర్శతో బండ్లు విడిచి నడుచుకుంటూ వెళ్ళి పోయారు "అవును దేశం తిరుగక ఎన్నో విషయాలు తెలియక తాను అనుకున్న దానికల్లా భయపడుతూ ఉన్నది అందుకని ఈసారి ఎలాగైనా స్వామి వెళ్ళిన చోటికల్లా తాను వెళ్లి క్రొత్త సంగతులు తెలుసుకోవాలి. అని నిశ్చయించుకుంది సరిగ్గా అదే సమయంలో స్వామి కూడ " ఆమె తన కుమారునికి ఏమవుతుందో అనే భయమునుండి దూరం కావాలంటే తీర్థయాత్రలు చేయవలసిందే " అనే తీర్మానానికి వచ్చారు ఇంతకు స్వామి కండ్ల ఎదుట ఉండాలి ఆయన వైభవం పెరగాలి ఆయనకు ఏ ఆపద వచ్చినా తాను భరించ లేదు. అందుకని తాను ముందు జాగ్రత్తలు యోచిస్తూ వున్నది తనకు కూడా ఏ యితర కోరికలు లేవు. ఈ తపనకంటే పరమమైన తపస్సు ఏముంటుంది

ఈశ్వరమ్మ అప్పుడే మానసికంగా కుదుటపడు తున్నది ఆమె ఒక హృదయవిదారక దృశ్యాన్ని చూచి తట్టుకోవలసివచ్చింది ఆ రోజుకు గురుపూర్ణిమ ఇంకా వారము ఉన్నది భక్తులు దూర తీరాల నుండి పర్తికి చేరుకుంటున్నారు తెల్లవారినా స్వామి బయటకు రాలేదు కస్తూరి వగైరాలు వెళ్లి చూచారు. వాళ్ళ కళ్ళను వాళ్లు నమ్మలేకపోయారు స్వామికి నోరు పడిపోయింది మాటలేదు మూతి కూడా పక్కకు లాగింది ఎడమ కాలు, ఎడమ చేయికి పక్షవాతం వచ్చింది ఏమి పాలుపోక బయటకు వెల్లడించే ధైర్యం లేక అక్కడే స్థాణువులై నిలుచున్నారు " స్వామి వేళకు రాలేదు ఏమయింది ?" అనెడి అందరి హృదయా లలోని ఆందోళన ఇక తల్లి ఉండబట్టగలదా ? మెట్లన్ని ఒక్క ఉదుటున ఎక్కింది తలుపు దబదబా తట్టింది కస్తూరికి తెలుసు అది ఈశ్వరమ్మ అని. తలుపు తీశాడు పరిస్థితిని చూసింది అంచనా వేసు కొన్నది "అవును స్వామికి సుస్తీ చేసింది ఎందుకు! అనే విచారణ తర్వాత. ముందు వైద్యము చూడాలి కదా ! ఏమి చేయకుండ చేతులు ముడుచుకొని కూర్చుంటే ఎట్లా ? " ఇది ఆమె ఆందోళనతో కూడిన

వాదన ఇంతలో ఒకరు బెంగళూరు వెళ్ళి ఆరోగ్య శాఖాధికారిని తీసుకొనివచ్చారు ఆయన వెల్లవరిన తర్వాత బాబాను చూచాడు. ఇది "మెదడువాపు వ్యాధి" వెంటనే చికిత్స చేయాలి అన్నారు కాని స్వామి ఆయనను తోసివేశారు చేసేది లేక వైద్యులు వెళ్ళిపోయారు. ఇక ఆశ్రమములో, ప్రార్థనామందిరములో ఉండేవాళ్ళు తమ బాధను దిగమింగలేక బయటకువచ్చి బోరున ఏడ్చారు "తాము నమ్ముకున్న స్వామికే ఇట్లా వస్తే, తమ గతి ఏమిటి ? కొందరు తమ ప్రాణాలను ఇస్తాము స్వామిని ఆరోగ్యవంతునిగా చేయమని తమ కులదైవాలను ప్రార్థించారు చాల భారంగా రోజులు గడిచినవి ఇక గురుపూర్ణిమ రానే వచ్చింది కస్తూరిని సైగతో పిలిచి, ప్రార్థనామందిరములో కుర్చీలో తనను కూర్చోబెట్టమన్నారు తల్లి, తండ్రి ఈ దృశ్యము చూడలేక కొంత దూరంలో వుండి తమ మనుష్యులను పంపి ఎప్పటి సమాచారం అప్పుడు తెలుసుకుంటున్నారు కుర్చీలో కూర్చోబెట్టిన తర్వాత స్వామి కుడిచేతితో తీర్థము తీసుకొని ఎడమపార్శ్వము మీద చల్లుకొని, ఝాడించి లేచి నిల్చున్నారు అందరూ ఆనందభాష్పాలు రాల్చారు జయజయధ్వానాలు చేశారు తల్లి, తండ్రి ఈ హర్ష ధ్వానాలకు కారణం తెలుసుకొని సంతోషంతో మైమరచిపోయారు " God takes his devotees into deep waters, not to drown, but to cleans" అనే వాక్యము ఈశ్వరమ్మ విషయములో సత్యమయింది కొద్ది రోజులు గడిచిన తర్వాత అట్లా స్వామికి పక్షవాతము ఎందుకు వచ్చింది ? అని కస్తూరి వారినే అడిగి సమాధానం రాబట్టగలిగారు ఈశ్వరమ్మకు తెలియపరచాడు ఆ సంగ్రహము ఇట్లా వున్నది

## శివశక్తిస్వరూపులు

బృహస్పతి కుమారుడైన భారద్వాజమహర్షి వేదములకు భాష్యము తెలుసుకొనవలెనని, అందుకుగాను తన ఆయుర్దాయము మూడువందల సంవత్సరాలైనా పెరగాలని ఇంద్రుని గూర్చి తపస్సు చేశాడు ఆ వరాన్ని పొందాడు కాని అప్పటికిని తృప్తి చెందలేదు మరల తపస్సు చేశాడు ఈసారి ఇంద్రుడు మహర్షికి ఒక మార్గం చెప్పాడు వేదములు అపౌరుషేయములు ఈ పద్ధతివల్ల నీవు అర్థము తెలుసుకోలేవు పార్వతీదేవిని ప్రార్థించి ఆమె సమక్షంలో ఒక యజ్ఞం చెయ్యి. నీకు ఆ జ్ఞానము లభిస్తుంది అన్నాడు భరద్వాజుడు అట్లాగే నందికేశ్వరపురం, విఘ్నేశ్వరపురం దాటి, కైలాసం చేరాడు. అక్కడ ఉమాశంకరులు నృత్యం చేస్తున్నారు ఢంకా, కాహళి మొదలగు వాద్యముల ధ్వనులు వినిపిస్తున్నవి ఓంకారనాదము ప్రతిధ్వనిస్తున్నది అట్లా నిల్చొని చూస్తున్నాడు ఆ నృత్యానికి అంతు కనపడలేదు శంకరుడు ఒక ప్రక్కకు ఒరిగితే ఉమ మరొక ప్రక్కకు ఒరుగుతూ ఏకాగ్రతతో నృత్యం చేస్తున్నారు మధ్యలో ఒక పర్యాయము ఉమ మహర్షిని క్రీగంట చూసింది కాని పలుకరించలేదు అప్పటికే ఏడు దినములు జరిగినందున ఇకలాభం లేదనుకొని మహర్షి వెనుదిరగబోయాడు కాళ్ళల్లో సత్తువ నశించి కుప్పకూలిపోయాడు. అప్పుడు ఉమాశంకరులు దగ్గరకు వచ్చి కమండలములోని నీళ్ళు చల్లి మహర్షిని లేవనెత్తాడు శంకరుడు ఇలా వరమిచ్చాడు "మావల్ల జరిగిన పొరపాటు చేత మిమ్ము అలక్ష్యము చేసితిమి అందుకు పశ్చాత్తాప పడుతున్నాము. ఇందుకు పరిహారంగా మీ భారద్వాజగోత్రంలో మేము మూడుసార్లు అవతరిస్తాము మీ వంశము పావనము అవుతుంది అంతేగాదు ప్రతిసారి వారంరోజులపాటు పక్షవాతంతో కాలం గడుపుతాము నీకు నీ వంశానికి శుభమగుగాక" అన్నాడు మహర్షి సంతుష్టుడై తిరిగి వచ్చారు ఆ అవతారములే షిర్డిసాయి, సత్యసాయి, రేపు రాబోయే ప్రేమసాయి. అంతేగాక ఆ సమయంలో ఒక పరమ భక్తుని వ్యాధిని తీసుకొని అతనిని రక్షించటం కూడ జరుగుతుంది ఈశ్వరమ్మ దీనిని బహు శ్రద్ధతో సాయి మాటలుగా కస్తూరి చెపుతుంటే విన్నది మిగతావాళ్ళ సంగతి ఏమోగాని తనకు కనువిప్పు కలిగింది. ఈ శివ

శక్తిస్వరూపునికి దిష్టి తగులుతుందని తాను ఎంత హంగామా చేసింది ఎవరి కళ్ళు నన్ను ఏమీ చెయ్యవులే అమ్మా ! అంటే ఏదో పిల్లతనము అనుకున్నది అట్లాగే అన్ని పేర్లు నావేలేనంటే ఆమెకు అప్పటికి అర్థము కాలేదు చిన్నప్పుడే దివ్యశక్తులు చూపిస్తుంటే పొరపాటు అభిప్రాయంతో అపోహపడ్డాము అనుకున్నది తాను ఉరవకొండలో స్వామి "... మానసభజరే" చెప్పినప్పుడే శిష్యురాలిగా చేరింది అందుకే స్వామి మాట్లాడినా, చమత్కరించినా, వివరించినా, ఆమె సాయిని దృష్టిలో ఉంచుకొని లోకోద్ధరణకే అలా చేస్తున్నాడని ఇప్పుడు గ్రహించింది

స్వామి విశ్వనాథుడు అనే అభిప్రాయం దృఢ పడుతూ వచ్చింది క్రమేణా భయం పోయింది స్వామి వెంబడి క్షేత్రాలకువెళ్ళి పురాతన భారతీయ సంస్కృతిని అర్థము చేసుకొన్నది తర్వాత స్వామి గోవా వెళ్లారు అక్కడ నకుల్ సేన్ అనే గవర్నరుగారి భవనంలో బస చేశారు అక్కడ వుండగానే స్వామికి తీవ్రమైన "అపెండిసైటిస్" వచ్చింది గవర్నరు కబురు పంపగా డాక్టరు వచ్చారు వెంటనే శస్త్రచికిత్స చేయకపోతే ప్రమాదం అన్నారు వారంతా వెలుపల ఉండి గడియారము చూసుకొంటున్నారు వైద్యమునకు స్వామి ఒప్పుకోలేదు ఆ బంతిలాంటి చీమును అవతల తీసి పారేశారేమో మరునాడు డాక్టర్లు చూసి అంతా Normal అన్నారు అనుకున్న గంటలకు బహిరంగ సభ జరిపారు ఈ సంగతి ప్రమాదంగా ఉన్నప్పుడే పెద్ద అక్షరాలతో పత్రికలలో ప్రకటించారు ఈశ్వరాంబకు చెప్పగా విన్నది ఈసారి భయం లేదు, ఆదుర్దాలేదు స్వామి ఎవరి జబ్బు తీసుకున్నారో ! అలాగే వదలివేస్తారు అనుకున్నది స్వామి మాటలు జ్ఞాపకం ఉండటము వలన నాకు నమ్మకం దృఢతరమైంది. "నాకు జబ్బులు చేయవు జబ్బు చేసినట్లుగా మీకు కనిపించినా అదేదో భక్తుని రక్షించటానికి కోరి తీసుకొన్నదే. ఈ అవతారంలో సంకల్పం వృథా కావటం అంటూ లేదు" అన్నారుగదా ! అని ఆమె చెప్పింది

## ప్రథమ బాలవికాస గురువు

ఈశ్వరాంబ ఎక్కడ ఉంటే అక్కడ పిల్లలు తేనెటీగల్లా ముసిరేవారు కారణం లేకపోలేదు. అమ్మ పకడ్బందీగా కథలు అల్లి చెప్పగలదు రామాయణ, భారత, భాగవత కథలే గాక షిర్డిసాయి కథలు కూడ చెప్పేది మహారాష్ట్రనుండి వచ్చే భక్తుల ద్వారా వాటిని సేకరించేది కథలు చెప్పేటప్పుడు యుద్ధంలో నాయకుల గర్జనలు, బందీలుగా ఉన్న స్త్రీల ఆర్తనాదములు, పశువులను అడవికి తోలుకుపోయేటప్పుడు వేసే ఈలలు, పల్లెపాటలు అన్నీ ఉండేవి ప్రతిదానికి చివర స్వామి చెప్పిన సూక్తులతో సరిపోయేదాన్ని చెప్పేది ఆ పిల్లలు ఎంతో ఏకాగ్రతతో వింటుంటే పెద్దవాళ్ళు కూడి వినాలనే కుతూహలంతో ఏదో ఒక నెపంమీద దగ్గరకు వెళ్ళి కాసేపు వినేవాళ్ళు అమ్మ అల్లిన కథలు అంతర్జాతీయ పోటీలకు వచ్చే కథలకు తీసిపోవు అన్నాడు కస్తూరి ఎట్లాగో శ్రమపడి ఒక కథను తెలుసుకున్న తర్వాతనే పైఅభిప్రాయానికి వచ్చాడు.

ఇప్పుడు స్వామి మహిమకు నిదర్శనములుగా కొన్ని అద్భుతాలను చూస్తూనే వున్నది చిన్నప్పుడు చూసింది అప్పుడు బాగా చదువుకొన్న పండితులుకూడ అదేదో బ్రహ్మరాక్షసి చేస్తూంది అంటే తానేమి ఊహించగలదు! ఇపుడు ఆ పండితులే వాటిని దివ్యశక్తులంటున్నారు. స్వామిని వదలిపెట్టటంలేదు తీర్థయాత్రలకు వెళ్ళినా వెంట ఉంటున్నది స్వామికూడ ఆమె దేశములు తిరగవలసిన అవసరము గ్రహించి తీసుకొనివెళ్తున్నారు.

స్వామి అక్కడ కైలాసంనుండి లింగాన్ని తెప్పించారు అప్పటికప్పుడు తుమ్మిపూలు తెప్పించి సమర్పించారు ఆ ప్రాంతాలలో ఆ పూలు లేవు. సోమనాథ్‌కు వెళ్ళినపుడు అదృశ్యముగా లోపల ఉన్న జ్యోతిర్లింగాన్ని తెప్పించి అందరికి చూపించారు. బృందావనం

వెళ్ళినపుడు 18 అంగుళముల శ్రీకృష్ణుని స్వర్ణ విగ్రహాన్ని నవనగర్ మహారాణికి సృష్టించి యిచ్చారు అంతెందుకు ఆశ్రమంలో ఉన్న రాధాకృష్ణమూర్తి చనిపోతే స్వామి చూడలేదని శవాన్ని గదిలోనే వుంచారు. చీమలుపట్టే స్థితికి వచ్చింది మూడవరోజు ఉదయం స్వామి స్పృశించి జీవంపోసి లేపారు తర్వాత 10 సంవత్సరాలు నిక్షేపంగా జీవించారు అట్లాగే అమెరికానుండి వచ్చిన 'కోవన్'ను బ్రతికించారని కస్తూరి చెప్పారు ఇది వెనుకటి భాగవతములోని కథలాగా ఉన్నది అఘాసురుడు కొండచిలువ రూపంలో విశ్వాలంగా పడుకొని గోపబాలురను ఆకర్షించి చంపాలనే ప్రయత్నంలో వున్నాడట అనుకున్నట్లుగానే గోపబాలురు అదేదో శిల్పమనుకొని నోట్లో ప్రవేశించి లోపలనుండి వచ్చే వేడి గాడ్పులకు విక్షిప్తులైనారు. అట్లాగే కృష్ణుడు కూడ ప్రవేశించాలని నోరు మూయకుండా తెరుచుకొని ఉన్నాడు దేవతలు హాహాకారాలు చేస్తుండగా శ్రీకృష్ణుడు ప్రవేశించి తన కాయాన్ని పెంచి అఘాసురుని చంపి ప్రాణాలు పోయిన ఆ గోపబాలకులను సజీవులుగా చేశారు ఇక్కడ స్వామి చేసింది అలాగే వుంది విగత జీవులకు ప్రాణం పోయటం ఈ యుగంలో కూడ సాధ్యమేనని స్వామి ఋజువు చేశాడు

ఆమె మరొక కథ భాగవతంలో చదివింది. ఆపాట కూడ చక్కగా పాడగలదు శ్రీకృష్ణుడు, గోపబాలకులతో అడవిలో గడుపుతూ, చల్దులు ఆరగించుచు, దేవతల కంటే ఆనందంగా వున్నారు, ఇదేదో వింతగావుంది ఇంతమంది శ్రీకృష్ణుడు ఎట్లా కూర్చుంటే అట్లా కూర్చుంటారు. ఎట్లా తింటే అట్లా తింటారు. దీని సంగతి చూద్దామని గోవులను, గోపబాలకులను బ్రహ్మ హరించి తన లోకానికి తీసుకొనిపోయాడు ఒక సంవత్సరము తర్వాత మరల ఆ ప్రాంతాన్ని చూచాడు అంతా మామూలుగానే వుంది గోపబాలురు, గోవులు మునుపటికన్నా ఉత్సాహంగా, ఆరోగ్యంగా కనపడుతున్నారు. తాను తీసుకొనివెళ్ళిన పరివారమంతా తన లోకంలోనే ఉన్నారు అప్పుడు దిగివచ్చి బ్రహ్మ శ్రీకృష్ణుని లోకనాథుడిగా గుర్తించి కీర్తించాడు. అక్కడ గోవులు, గోపబాలకులు అన్ని శ్రీకృష్ణుని రూపాలే అటువంటి కథను చెప్పాడు స్వామి హార్సిలీ హిల్స్ దగ్గర గోకాక్ వగైరాలతో మాట్లాడుతూ హఠాత్తుగా పడిపోయినారు దగ్గర ఉన్న వాళ్ళకు స్వామి తన సూక్ష్మరూపంలో ఏ భక్తుని రక్షించటానికో వెళ్ళి ఉంటారు అనుకున్నారు కాని అసలు విషయము ఒక ఆర్మీ ఆఫీసర్ కొన్ని కారణాలవల్ల ఆత్మహత్య చేసుకోవాలని రివాల్వర్ పట్టుకొని తలుపులు మూసివేశాడు ఇంతలో తలుపు తట్టినట్లు చప్పుడుకావడంతో రివాల్వర్ పరుపుక్రింద దాచి తలుపులు తెరిచాడు ఎదురుగా తన చిన్ననాటి స్నేహితుడు, ఆయన సతీమణి ఒక సేవకుడు, తన యజమాని బెడ్డింగ్‌తో వచ్చాడు స్నేహితులు ఇద్దరూ చిన్నప్పటి సంఘటనలను ఒక్కగంట సేపు ముచ్చటించుకున్నారు ఆఫీసర్ భార్య అక్కడ లేదు ఒంటరిగా ఉంటున్నాడు. ఆయనవల్ల ఆ విషయము తెలుసుకున్న స్నేహితుడు, మరొక స్నేహితుని ఇంటికి వెళ్ళిపోతూ ఎక్కడ ఉండేది అడ్రసు ఇచ్చాడు అతను వెళ్ళగానే మేజర్ తలుపులు వేసి రివాల్వర్ కోసము వెదుకగా కన్పించలేదు. అడ్రస్ ప్రకారము వాకబుచేస్తే అలాంటివారు అక్కడికి ఎవరూ రాలేదని తెలిసింది కొన్నాళ్ళకు ఆఫీసర్ పుట్టపర్తి రావటం జరిగింది. అప్పుడు సాయి " ఇదుగో నీ రివాల్వర్ " అంటూ తిరిగి ఇచ్చారు ఈ గాథలో నిజమెంత అని కస్తూరిని అడిగి అమ్మ ఋజువు చేసుకున్నది

బెంగుళూరులో వేసవి శిక్షణకొరకు ఉపాధ్యాయులను ఎంపిక చేసి పిలిపించారు అక్కడ అందుకు సన్నాహాలు జరుగుచున్నవి దేశ, విదేశాలనుండి వచ్చిన మహిళలు ముఖ్యంగా ఈశ్వరమ్మను చూడకుండ వెళ్ళరు ఒక్కొక్కప్పుడు వాళ్ళ భాష అమ్మకు రాదు దుబాసి

కూడ సమయానికి దొరకకపోవచ్చు. వాళ్ళ భాషలోనే చెపుతారు అమ్మకు తెలుగు తప్ప వేరు భాష రాదని వాళ్ళకు తెలుసు. అయినా దేవునికి చెప్పుకున్నట్లు నివేదించేవారు అమ్మ అంతా ఓపికగా వింటుంది చివరకు అంతా స్వామి దయ అంటుంది ఆమె నిండు మనసుతో ప్రేమైక దృక్కులతో, నోసినోటితో ఆ మాట అనిపించుకొని తమ మీద స్వామి ఆశీస్సులు వర్షించినట్లే తృప్తిపడిపోతుంటారు. విదేశీయులైనా అంతా స్వామి దయ అనే మాటకు అర్థము తెలుసుకున్నారు మనుమడు "అమ్మమ్మా! నీకు ఆ భాష రాదుగా" అంటే "భాషతో ఏమి పనిరా! వారు బాధలో వున్నారు స్వామి దయతో బాధ తగ్గుతుంది" అనేది.

## సాయుజ్య సిద్ధి

ఆ రోజున ఆమె స్వామితో బెంగుళూరు వెళ్ళింది ఆరాత్రికూడ, మనుమలు, మనుమరాండ్రతో కూర్చొని వుంటే కస్తూరి చూశాడు తెల్లవారి జరుగబోయే కార్యక్రమానికి అలంకరణతో పండుగ వాతావరణము ఏర్పడినది స్నానాల గదికి వెళ్ళబోతూ "స్వామి!" అని కేక వేసింది స్వామి ఆ గదికి పైనే ఉన్నారు "వస్తున్నా" అన్నారు. ఆమె అంతిమ శ్వాస విడిచింది కొద్ది రోజుల క్రితమే నాలుగు దినాలు జ్వరము వచ్చి తగ్గింది ఒళ్ళంతా నొప్పులుగా ఉంటే అటూ, ఇటూ పొర్లుతూ ఉన్నది స్వామి కంఠము వినిపించింది అమ్మాయీ! నొప్పులు తగ్గినవా! తగ్గుతాయి లే, అన్నారు తాను కళ్ళు తెరచి చూసింది. ఎదురుగా శ్రీరామచంద్రమూర్తి తన కోదండముతో సహా దర్శనమిచ్చాడు తాను మంచం దిగబోయింది వారించాడు. మరల సాయిబాబాగా మారిపోయినాడు ఆ సాయంత్రం పెద్దబొట్టు చూడటానికి వెళ్లింది అమ్మ అన్నది. "పెద్దబొట్టూ! మన స్వామి ఆ శ్రీరామచంద్రుడే!" అంటూ తన అనుభవము చెప్పింది శ్రీరామచంద్రమూర్తిగా నాకు తెలిసినంతవరకు ఇద్దరికే స్వామి దర్శనమిచ్చాడు అన్నది పెద్దబొట్టు

ఏడుపులు ఆర్భాటాలు లేకుండా దాదాపు రహస్యంగానే ఆమె భౌతికకాయాన్ని పుట్టపర్తిలోని ఆమె పెద్ద కొడుకు ఇంటిలో వుంచారు ఈ సంగతి దావానలంలా ఊరంతా వ్యాపించింది ఇండ్లలో పురుగు లేకుండా అమ్మ అంతిమ దర్శనంకోసం తరలివచ్చారు రారు మరి! ఎన్నిసార్లు వాళ్లను ఆమె ఆసుపత్రికి తీసుకు వెళ్లింది దగ్గర వుండి మందు ఇప్పించింది తమ పిల్లలకు చదువుకోవటానికి కస్తూరితో చెప్పి డబ్బు యిప్పించింది. బడి మానివేసిన పిల్లలకు ఎన్నోసార్లు చదువుకోమని చెప్పి పంపింది బీదవాళ్ళకు సిల్కు చీరలు పంచిపెట్టింది వాళ్ల జీవితంలో అటువంటివి కొనలేరు ఆమెకు సాయి భక్తులనే తెలుసుగాని, జాతి, మత, కుల భేదములు చూచేది కాదు ఆశ్రమంలో ఉన్న సర్వమత ప్రేమైక స్థూపముయొక్క అర్థము కస్తూరి ద్వారా తెలుసుకున్నది. ఆ ప్రేమమూర్తి ఇక వారి మధ్య లేదు ఆమెను తలచుకొని పిల్లలు, పెద్దలు బావురుమన్నారు. ఆ విశ్వమాతకు పిన్న, పెద్ద అందరూ జోహారులు సమర్పించారు ఆమె భౌతిక కాయాన్ని ఆమె భర్త సమాధి ప్రక్కనే ఉంచి సమాధి కట్టారు

ధన్యవమ్మా! నీవు జగద్రక్షకుని భిక్షగా యిచ్చిన ఈశ్వరాంబా! విశ్వమాతవమ్మా! నీవు.

( 8 వ పేజీ తరువాయి )

కున్నవారు కదా! వాళ్ళుకూడా మాతోపాటు మారవల సిందేనని నవ్వారు ఒక తట్ట మోసే కూలీ మనస్సును ఒక అనుభవంగల హృద్రోగ నిపుణుని మనస్సును మార్చగలిగింది ఒక చైతన్యం (సాయిబాబా) ఇంత కన్నా ప్రపంచంలో ఏదైనా మెరికల్ (అద్భుతం) ఉంటుందా? లేదని నా భావన, మనిషి మనస్సును మార్చటంకన్నా వేరొక గొప్ప మెరికల్ ఈ ప్రపంచములో లేదు

మరో విశేషమున్నది ఈ ఒక్క దేశంలోమాత్రమే రమణమహర్షి, అరవిందయోగి, సాయిబాబా, కంచి పరమాచార్యులలాంటివారు మన మధ్య ఎప్పుడూ తిరుగుతూనే ఉంటారు ఏ దేశములోనూ ఇది లేదు. ఇది ఒక్కటీ మనం గ్రహించినట్లయితే, మనం ఎటువంటి భూమిలో పుట్టాం? మన వారసత్వం ఏమిటి? మన బాధ్యత ఏమిటి? ఈ అఖండమైన జ్యోతిని తరువాత తరం వారికి అందించగలమా? ఆలోచిస్తే మనకు ఒక ప్రేరణ వస్తుంది రానున్న యువతరం విషయం ప్రతి ఒక్కరూ ఆలోచించాలి మన పిల్లల విషయంలో మార్పు తీసుకొని రాకపోతే మనం ఎన్ని పుస్తకాలు చదివినా ప్రయోజనంలేదని నా నమ్మకం మన తరువాత ఈ దేశసౌభాగ్యాన్ని తీర్చిదిద్దవలసిన వారు పిల్లలు. ఈ దేశభవిష్యత్తు వారిమీద ఆధారపడి ఉన్నది అయితే మనం ఏంచేస్తున్నాం? పనికిరాని చదువులకు, అర్థంలేని పరుగు పందాలకు గుర్రాలులాగా తోలుతున్నాం రెండు సంవత్సరాలు నిండకముందే స్కూళ్ళకు పంపే కసాయివాళ్ళలాంటి తల్లిదండ్రులున్నారని చెప్పటానికి బాధపడుతున్నాను. ఒక పెద్దాయన ఒక మాట అన్నాడు పిల్లలు ఇంట్లో వుంటే తల్లిదండ్రులకు బరువుగా ఉంటున్నారని, వీళ్ళని ఎప్పుడు స్కూళ్ళకు పంపించుదామాయని తల్లిదండ్రులు ఆలోచిస్తున్నారు వీరు ఎప్పుడు క్లాసులో నుంచి బయటకు వెళ్ళుతారాయని టీచర్లు భావిస్తున్నారు రోడ్డుమీదకు వస్తే పోలీసువారు కనుక పిల్లలు సినిమా హాళ్ళలో తిరుగుతున్నారన్నారు ఆయన ఇప్పుడు టీ వీ లు వచ్చాయి కనుక Children are wanted no where పిల్లలపట్ల మనం మమకారాన్ని ప్రదర్శించలేమేమో, వారికోసం మన కాలాన్ని వెచ్చించలేమో, వాళ్ళను మనకు దూరం చేసుకోవటం కాదు, మన సంస్కృతికి కూడా దూరం చేస్తున్నాం ఈ విషయంలో సాయిబాబావారు పిల్లలతో ఎలా వ్యవహరిస్తారో చూడండి అక్కడ పిల్లల్ని చనువుతో, ప్రేమతోతన పిల్లలలాగే ఆదరణతో వాళ్లలో ఒకడిలాగే నవ్వుతూ ఆడుకుంటూ పిల్లలమధ్య వుంటున్నప్పుడు చూస్తుంటే మనకెంతో ఆనందం వేస్తుంది మన పిల్లలకోసం ఆయన తపన పడుతుంటే, మన పిల్లలకోసం మనం ఏం చేస్తున్నాం? మనం కోట్లు గడించవచ్చుగాక! చిన్నప్పుడు తల్లిదండ్రులు తమ వాత్సల్యాన్ని పిల్లలకు పంచకపోతే ఇవాళ అమెరికాలో ఏమిజరుగుతున్నదో, అది భారతదేశంలో జరగటానికి నాలుగైదు ఏళ్ళుకూడా పట్టదు అమెరికాలో ఏమి జరిగింది టి వి. ఛానలును మార్చమని కొడుకు మారాం చేస్తే, తుపాకీతో కొడుకును కాల్చింది తల్లి ఈ వార్త వారం క్రిందట హిందూలో వచ్చింది 13, 14 ఏండ్లున్న విద్యార్థులు 20 ఏండ్లున్న టీచర్ని మానభంగం చేశారు ఒక స్కూలులో అటువంటి వాటిని హైలెట్ చేసే సాహిత్యం, అటువంటివాటిని నవలలుగా, కథలుగా ముద్రించే పత్రికలు వెలువడుతుంటే మనమంతా ఎందుకు ఊరుకొంటున్నాం?

కాలుష్యం వాతావరణంలో వస్తుంటే అరుస్తున్నాం మందులలో వస్తుంటే గగ్గోలుపెడుతున్నాం ఆహారంలో వస్తుంటే గోలచేస్తున్నాం అటువంటి కాలుష్యం సాహిత్యంలో వస్తుంటే ఎందుకు వ్యతిరేకించటంలేదు? అన్నిటికన్నా భయంకరమైనది సాహిత్య కాలుష్యం ఈ సాహితీకాలుష్యాన్ని నివారించాలేకపోతే సమాజంలో విలువలు క్షీణించి అరాచకత్వం ప్రబలుతుంది

ఈనాడు మనం సంధియుగంలో ఉన్నాం ఈ దేశం యొక్క అస్తిత్వాన్ని ప్రశ్నించేటటువంటి శక్తులు విలయతాండవం చేస్తున్నాయి వాటికి తలవంచే దౌర్భాగ్య స్థితి ఏర్పడుతున్నది పరమాత్ములు ఎంతమంది ఉన్నా, ఎవరు ఎంత వున్నా మనం లేచి నిలబడకపోతే మన జ్యోతిని, మన జాతిని మనం కాపాడుకోలేం ఈ చారిత్రాత్మకమైన బాధ్యత మన మీద ఉన్నది గనుక ఆ స్ఫురణను మనం గ్రహించి సాయి సందేశంలోని ప్రేమను పదిమందికి పంచగలిగితే కనీసం ఈ తరానికి ఈ దీపాన్ని నిలబెట్టినవాళ్ళమవుతాం అటువంటి మహా ప్రయత్నములో వున్నటువంటి కృష్ణమోహనరావుగారికి నా హృదయపూర్వక అభినందనలు, నమస్కారములు

( శత పంచిక మహోత్సవంలో శ్రీ వాకాటివారు చేసిన ప్రసంగం నుండి )